# లఘు చిత్రంతో మొదలైంది!

అసిస్టెంట్, అసోసియేట్ ఆపైన కో డైరెక్టర్... వెనక ఇన్ని మెట్లెక్కితేగానీ డైరెక్టర్ సీట్లో కూర్చునేవారు కాదు. కానీ కాలం మారింది, వేగం పెరిగింది. దర్శకత్వం చేపట్టడానికి అన్ని మెట్లు లేవు. ఉన్నదల్లా ఒకటే మెట్టు 'షార్ట్ ఫిల్మ్స్'. కావాలంటే ఈ యువ దర్శకుల్ని చూడండి.

## లక్షల వీక్షణలు...

'నిన్ను కోరి'లో ప్రేమ, పెళ్లి అంశాల్ని కొత్త కోణంలో చూపి ఆరంభం అదిరిందని పించాడు యువ దర్శకుడు శివ నిర్వాణ. ఎమ్మెస్సీ, బీఈడీ చేసిన శివ కొన్నాళ్లు బోధన రంగంలోనూ ఉన్నాడు. తర్వాత సినిమా ప్రయత్నాలు మొదలుపెట్టాడు. దర్శకత్వ విభాగంలో ఎవరి దగ్గరా అసిస్టెంట్‌గా పనిచేయకుండా సినిమా స్క్రిప్టులు రాసుకున్నాడు. వెండితెరపైకి వెళ్లేముందు తనలోని దర్శకుణ్ని ఓసారి పరీక్షించుకుందామనుకున్నాడు. అందుకోసం షార్ట్ ఫిల్మ్ సరైన మార్గం అనుకున్నాడు. అలా తీసినవే 'లవ్ ఆల్జీబ్రా', 'వన్ మోర్ స్మైల్' లఘుచిత్రాలు. 2014లో వీటిని తీసి యూట్యూబ్‌లో పెట్టాడు శివ. 'లవ్ ఆల్జీబ్రా'కి అయిదు లక్షల వీక్షణలూ, 'వన్‌మోర్ స్మైల్'కు రెండు లక్షలకు పైగా వీక్షణలూ, వచ్చాయి.

## పెళ్లిచూపులు మినీ...

తొలిచిత్రం 'పెళ్లిచూపులు' తోనే జాతీయ అవార్డు దక్కించుకున్న దర్శకుడు తరుణ్ భాస్కర్. సినిమాల్లోకి రాకముందు 'అనుకోకుండా', 'సైన్మా' అనే రెండు లఘుచిత్రాలు తీశాడు. 'అనుకోకుండా'... కేవలం 48 గంటల్లో తీసిన సినిమా. 2012లో జరిగిన '48 అవర్స్ షార్ట్‌ఫిల్మ్స్ ఫెస్టివల్' పోటీల్లో ఈ లఘు చిత్రాన్ని తీసి అవార్డు గెల్చుకున్నాడు తరుణ్. కేన్స్ ఫిల్మ్ ఫెస్టివల్‌కి ఇది షార్ట్‌లిస్ట్ అయింది. యూట్యూబ్‌లో దీనికి దాదాపు 25 లక్షల వీక్షణలు వచ్చాయి. దీన్లోనూ కాన్సెప్ట్ పెళ్లిచూపులే. 'పెళ్లిచూపులు' హీరోయిన్ రీతూ వర్మ దీన్లో నటించి, ఉత్తమ నటిగా అవార్డు అందుకుంది. ఇతడి 'సైన్మా'కు 17 లక్షలకు పైగా వీక్షణలు వచ్చాయి.

## నలభై లఘు చిత్రాలు

'రన్ రాజా రన్' దర్శకుడు సుజిత్ 24 ఏళ్లకే మొదటి సినిమా తీశాడు. కానీ మొదటి సినిమా కంటే ముందు అతడు 40 లఘు చిత్రాలు తీశాడంటే నమ్మగలరా? సుజిత్ తీసిన లఘు చిత్రాల్లో 'తొక్కలో లవ్‌స్టోరీ', 'ఇండియన్ ఐడల్స్', 'లవ్ కెమికల్' లాంటివాటికి లక్షల్లో వీక్షణలు ఉన్నాయి. ప్రస్తుతం ప్రభాస్‌తో 'సాహో' తీస్తున్నాడీ దర్శకుడు. 'ఇంటర్మీడియెట్, డిగ్రీ రోజులనుంచీ షార్ట్‌ఫిల్మ్స్ తీశాను. డిగ్రీ తర్వాత డీఎఫ్‌టీ కోర్సు చేశాను. యూవీ క్రియేషన్స్ వాళ్లు కొత్త కథల కోసం చూస్తున్నారని తెలిసి వెళ్లి నా కథ వినిపించాను. ప్రాజెక్టు ఓకే అయింది. ఇంట్లోవాళ్ల ప్రోత్సాహం, నా షార్ట్‌ఫిల్మ్సే వల్లే ఇక్కడివరకూ రాగలిగాను' అంటాడు సుజిత్.

## సీరియస్ నుంచి కామెడీ

హిట్ చిత్రాలు... 'వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్', 'ఎక్స్‌ప్రెస్ రాజా'ల దర్శకుడు మేర్లపాక గాంధీ. సినిమాల్లోకి రావాలనే లక్ష్యంతో డిగ్రీ తర్వాత ఎల్వీప్రసాద్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరాడు. అక్కడ చదువుతూనే 'కర్మరా దేవుడా' పేరుతో ఒక లఘు చిత్రం తీశాడు. యూట్యూబ్‌లో దాన్ని చూసి అతడికి సినిమా చేసే అవకాశం ఇస్తామన్నారట కొందరు. 'ఆ లఘు చిత్రం తర్వాత నా ఆత్మవిశ్వాసం పెరిగింది. ఆ వెంటనే 'వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్' తీసేందుకు ప్రయత్నాలు మొదలుపెట్టాను' అని చెబుతాడు గాంధీ. మొదట సీరియస్ సినిమాలు చేయాలనుకున్న గాంధీ... 'కర్మరా దేవుడా' తర్వాత కామెడీ సినిమాలు బాగా తీయగలనన్న నమ్మకంతో అటువైపు వెళ్తున్నాడట.

## ఫేస్‌బుక్ నుంచి సినిమాలకు

'భలే మంచి రోజు', 'శమంతక మణి'ల దర్శకుడు శ్రీరామ్ ఆదిత్య. గూగుల్, ఫేస్‌బుక్‌లలో సాఫ్ట్‌వేర్ ఇంజినీర్‌గా పనిచేసిన ఆదిత్యకు సినిమాలంటే పిచ్చి. అయితే నేరుగా సినిమా ప్రయత్నాలు చేయకుండా ముందు కొన్ని లఘు చిత్రాలు తీశాడు. '48 అవర్స్ షార్ట్‌ఫిల్మ్స్'లో పాల్గొని తీసిన 'కన్‌స్పిరసీ' షార్ట్‌ఫిల్మ్‌కి అవార్డుతోపాటు ప్రశంసల్నీ అందుకున్నాడు. ఆ తర్వాత సినిమా నిర్మాణ సంస్థల దగ్గరకు స్క్రిప్టులు పట్టుకువెళ్లడం ప్రారంభించాడు.



## పాపం నేపాల్!

దేశంలో నోట్ల రద్దు వల్ల తలెత్తిన సమస్యలు దాదాపు సద్దుమణిగినట్లే కనిపిస్తున్నాయి. కానీ నేపాల్, భూటాన్ ప్రజలు మాత్రం ఇప్పటికీ ఆ ప్రభావం నుంచి తేరుకోలేకపోతున్నారు. అక్కడివాళ్లకీ, మన నోట్ల రద్దుకీ సంబంధమేంటంటే... ఆ రెండు దేశాల్లోనూ గతంలో భారత కరెన్సీని అధికారికంగానే చెలామణీ చేసేవారు. వ్యాపార లావాదేవీలకూ మన నోట్లను స్వీకరించేవారు. దాంతో భారత్‌లో పనిచేస్తున్న వేలాది నేపాల్, భూటాన్ వాసులు తమ దేశ కరెన్సీలోకి మార్చకుండానే భారతీయ కరెన్సీని తమ కుటుంబ సభ్యులకు పంపించేవారు. కానీ నోట్ల రద్దుతో ఒక్కసారిగా కథ అడ్డం తిరిగింది. అక్కడి బ్యాంకులు వాటిని తీసుకోలేదు. ఆ దేశస్థులకి ఇక్కడ బ్యాంకు ఖాతాలూ లేవు. దాంతో ఆ రెండు దేశాల్లోని ప్రజల దగ్గర దాదాపు రూ.3300 కోట్లు



విలువు చేసే పాత ఐదొందలు, వెయ్యి రూపాయల నోట్లు వృథాగా పోగై ఉన్నాయి. అందులో భూటాన్ వాసుల దగ్గర రూ.100కోట్లు ఉంటే, మిగతా డబ్బంతా నేపాల్ ప్రజల దగ్గరే ఉంది. వాటిని మార్చుకోవడానికి ఎలాంటి అవకాశం ఇవ్వాలన్నదానిపైన ఇప్పటికీ ఆర్‌బీఐ నుంచి స్పష్టత రాకపోవడంతో ఆ డబ్బంతా ప్రజల ఇళ్లలోనే మగ్గుతోంది. దీన్నే అదనుగా భావించిన కొందరు వ్యాపారులు, ఎప్పటికైనా ఆర్‌బీఐ వాటిని స్వీకరిస్తుందన్న నమ్మకంతో ప్రజల దగ్గర నుంచి పెద్ద నోట్లను తూకం వేసి కొనుగోలు చేస్తున్నారట. ఆ ఆశలేని ప్రజలు మాత్రం దొరికిన దానితో సంతృప్తి పడదామని ఎంతొస్తే అంతకి తమ దగ్గరున్న పాత నోట్లను అమ్మేస్తున్నారు. మళ్లీ ఎప్పుడు ఏ ప్రమాదం ముంచుకొస్తుందోనన్న భయంతో ఇటీవల భారత్‌లో ప్రవేశపెట్టిన కొత్త నోట్లను అక్కడివాళ్లు పూర్తిగా వాడటం మానేశారు.

# లోపల...





**ఆఫీస్... మహాభారత్!**

ఆఫీసులో మన చుట్టూ కనిపించే కొందరు మనుషుల స్వభావం అచ్చంగా మహాభారతంలోని కొన్ని పాత్రల్ని తలపిస్తుంది. శకునిలా కుతంత్రాలు పన్నేవారు, శ్రీకృష్ణుడిలా మంచి నాయకుడిలా నిలిచేవారు, భీష్ముడిలా గంభీరంగా ప్రవర్తించేవారు, ఉత్తర కుమారుడిలా ప్రగల్భాలు పలికేవారు... ఇలా ఆఫీసు నిండా ఆ పురాణ పురుషుల వారసులే. కార్యాలయమే ఓ మినీ మహాభారత క్షేత్రం. 



# మీ మాట

ఈ సంచికపై మీ అభిప్రాయాలను sunday@eenadu.netకు మెయిల్ చేయవచ్చు.

### ఊహలకు రూపం

'ఈ కార్లకు డ్రైవింగ్ తెలుసు' కథనం ఆసక్తికరంగా ఉంది. డ్రైవర్ లేని కార్లు త్వరలో రానున్నాయన్న విషయం చదివాక చిన్నప్పుడు ఊహించుకున్న విషయాలు నిజం కాబోతున్నాయనిపించింది. భవిష్యత్తులో రాబోతున్న టెక్నాలజీ గురించి చాలా చక్కగా వివరించారు.

*- తవుటు రాంచంద్రం, జగిత్యాల*
*- మహేష్ దొంతగాని (ఈమెయిల్)*

### సందేశాత్మకం

'మనిషి మరణించలేదు' కథ ఆలోచింపజేసింది. రచయిత ఒకవైపు మానవతా విలువలు క్షీణిస్తున్నాయంటూనే మరో వైపు ఇంకా మంచితనం బతికే ఉందని చెప్పిన తీరు బాగుంది.

*- కె.వి. సుబ్రహ్మణ్యం (ఈమెయిల్)*
*- కులకర్ణి సురేష్‌బాబురావు, మహబూబ్‌నగర్ జిల్లా*

### గెలుపు పాఠం

'ఓడి... గెలిచారు' శీర్షికతో ప్రముఖులు గతంలో ఎదుర్కొన్న ఓటములు, విజయాల గురించి ఇచ్చిన కథనం స్ఫూర్తినిచ్చేలా ఉంది. 'కుర్రాళ్లకి రూ.6.5 కోట్లు' కథనం ఆసక్తికరం.

*- డాక్టర్ శివభూషణం, కర్నూలు*
*- సత్తి బాబు (ఈమెయిల్)*

### కొత్త ఆలోచనలు

తినేసే కాఫీ కప్పులూ, ప్రోటీన్ రేపర్ల గురించి మధ్య పేజీల్లో ఇచ్చిన విషయాలు ఆసక్తికరంగా ఉన్నాయి. వివిధ వంటకాలను రుచిచూపించడానికి ఏర్పాటు చేసిన హెబ్బార్స్ బ్లాగును లక్షల మంది ఫాలో అవుతుండటం ఆశ్చర్యాన్ని కలిగించింది.

*- ఎస్. రామకృష్ణ, విశాఖపట్నం*
*- సిహెచ్ శ్రీహరి (ఈమెయిల్)*

### బాగుంది

ఎయిటీస్ క్లబ్ పేరుతో అప్పటి నటీనటులంతా ఒక చోట కలుస్తుండటం అభిమానులకు సంతోషం కలిగించే విషయం. టాప్‌టెన్ కబుర్లు ఆసాంతం చదివించాయి. చిన్న పిల్లల పెంపకానికి సంబంధించిన పలు సందేహాలను తీర్చే ఆప్ బాగుంది.

*- బోను కీర్తి అనూష, రాజమండ్రి*

### ఆసక్తికరం

కుప్పిగానిపల్లెలో 200 మందికి పైగా సైనికులు ఉండటం వారి దేశ భక్తికి నిదర్శనం. ప్లాస్టిక్‌తో చేసిన కాక్టస్ మొక్కల ఫ్రేములు వినూత్నంగా ఉన్నాయి.

*- ఎస్. అనూరాధ, కరీంనగర్*

### మంచిమాట

రాముడంతటివాడే రావణుడికి నచ్చలేదు. కృష్ణుడంతటివాడినే కంసుడు మెచ్చలేదు. అందరూ మెచ్చేటట్లు, అందరికీ నచ్చేటట్లు జీవించాలనుకుంటే అంతకన్నా మూర్ఖత్వం మరొకటి లేదు.

# రారా కృష్ణయ్యా..!



**మనుషుల పుట్టిన రోజు ఆ కుటుంబానికి వేడుకయితే, కన్నయ్య పుట్టిన రోజు ప్రపంచానికే వేడుక. చిన్ననాడు తన అల్లరితో గోకులాన్నంతా ఒక్కచోటికి తెచ్చిన కన్నయ్యే, పెద్దయ్యాక బతుకు రాతంతా గీతలోనే ఉందంటూ మనుషులందర్నీ ఒక్క చోటికి చేర్చాడు. అందుకే ఆయన పుట్టిన రోజంటే ఊరూ వాడా సంబరమే. (రేపే శ్రీకృష్ణాష్టమి)**

'ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు... తిద్దరాని మహిమల దేవకీ సుతుడు...' అన్నాడు అన్నమయ్య చిన్ని కృష్ణుడి మీద అమితమైన ప్రేమతో. ఆయనే, 'చేరి యశోదకు శిశువితడు... దారుణి బ్రహ్మకు తండ్రియు నితడూ...' అనీ ఆశ్చర్యంతో పాడాడు. దేవకీ సుతుడూ, యశోదా నందనుడూ అయిన కన్నయ్య ప్రేమ స్వరూపి. అందుకే ఆయనంటే అందరికీ అంత ఇష్టం. కృష్ణస్వామి పుట్టగానే చెర సాలలో వేయి కాంతులు విరిశాయట, నందుడి ఇంటైతే నిత్యమూ ఓ ఉత్సవమే. కృష్ణయ్య మనుగడే అలాంటిది. ఆయనున్న చోట ప్రేమ చిరుగాలి దొంతరల్లా తారా డుతూ ఉంటుంది. అధరం మధురం... వదనం మధురం...నయనం మధురం... హసితం మధురం... మధురాధిపతి సక లమూ మధురమే. అందుకే ఆ మధురామృత ధారల్ని మన ఇంటా కురిపించాలని ఆయన్ని 'రా కృష్ణా... మా ఇంటికి రావూ...' అని ఆహ్వానిస్తాం. మన పిల్లల్నీ కృష్ణయ్యా, గోపికల్లా అలంకరిస్తాం.

### భువికేతెంచె...

త్రేతాయుగంలో కంసాది రాక్షసుల భారం మోయలేక భూదేవి బ్రహ్మాదిదేవతలకు మొర పెట్టుకుందట. అప్పుడే విష్ణుమూర్తి కృష్ణావ తారం దాల్చి భూమి మీద జన్మించాడు. దేవకీ వసుదేవులకు ఎనిమిదో సంతానంగా చెరసాల్లో పుట్టాడు కృష్ణుడు. పురాణాల ప్రకారం శ్రీముఖనామ సంవత్సరం శ్రావణ బహుళ అష్టమినాడు రోహిణీ నక్షత్రంలో అర్ధరాత్రి జన్మించాడు కృష్ణుడు. కృష్ణాష్టమిని నిర్ణయించేప్పుడు కొందరు తిథికీ, మరికొందరు నక్షత్రానికీ ప్రాధాన్యమిస్తారు. తిథి మాత్రమే ఉంటే కృష్ణాష్టమిగానూ, నక్షత్రం కూడా కలిస్తే శ్రీకృష్ణజయంతిగానూ వ్యవహరించాలని ధర్మశాస్త్ర గ్రంథాలు చెబుతున్నాయి. అందులోనూ సోమవారం కానీ, బుధవారం కానీ అయితే మరింత విశేషమని ధర్మసింధు గ్రంథం ద్వారా తెలుస్తోంది. ఈ రోజు స్వామిని అర్చిస్తే చతుర్విధ పురుషార్థాలు ప్రాప్తిస్తాయనీ, అన్ని పనుల్లో జయం కలుగుతుందనీ నమ్మకం.

### కన్నయ్య అడుగులు...

చేత వెన్నముద్ద చెంగల్వపూదండ
బంగారు మొలతాడు పట్టుదట్టి
సందె తాయెతులు సరిమువ్వ గజ్జెలు
చిన్ని కృష్ణా నిన్ను చేరి కొలుతు...

చిన్ని కన్నయ్యను యశోద ఎంత చక్కగా ముస్తాబు చేసేదో అచ్చం అలాగే ఆయన్ను అలంకరిస్తారు భక్తులు కృష్ణాష్టమి రోజున. ఉత్తరాదిన చాలా మంది భక్తులు ఈ పండక్కి ముందు రోజు ఉపవాసం చేస్తారు. ఆ రాత్రికి జాగరణ చేస్తారు. కృష్ణుడు అర్ధరాత్రి పుట్టాడు కాబట్టి ఆ సమయంలో కృష్ణప్రతిమకు మంగళస్నానం చేయించి, పట్టుబట్టలు కట్టి, ఆభరణాలతో అలంకరి స్తారు. స్వామికి నైవేద్యాలు సమర్పించి, ఊయల సేవ చేస్తారు. తర్వాత ప్రసాదం తీసుకుని ఉపవాసం ముగిస్తారు (కొంతమంది మర్నాడూ ఉపవాసం ఉంటారు). తర్వాతి రోజు ఇంటి ముందు ముగ్గులేసి, బియ్యా ప్పిండితో వాకిట్లో నుంచి ఇంట్లోకి కృష్ణుడి పాదాలను వేస్తారు. ఆయనకిష్టమైన పాలు, పెరుగు, వెన్న, మీగడలను పండ్లతో పాటూ నివేదిస్తారు. దక్షిణాదిలో తెలుగు రాష్ట్రాలతో పాటు తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాల్లోనూ ఈ వేడుకలు ఘనంగా జరుపుతారు. రోజంతా ఉపవాసం ఉండి సాయంత్రానికి పాలు, పెరుగు, వెన్న, మీగడలను స్వామికి నివేదన చేస్తారు. సాయంత్రానికి పిల్లా పెద్దా వీధుల్లో చేరి ఉట్ల పండగలో నిమగ్నమవు తారు. అష్టమి రోజు కృష్ణపూజ ఎలా చేయాలి అన్నది సాక్షాత్తూ బ్రహ్మదేవుడు నారదుడికి చెప్పాడని బ్రహ్మాండపురాణంలో ఉంది. మధుర, ద్వారక, బృందావనం, ఉడుపి, పూరీ, గురువాయూరు, తిరుమల తదితర క్షేత్రాల్లో కృష్ణాష్టమి వేడుకలను వైభవంగా జరుపుతారు. కృష్ణుడు పాలించిన నగరం ద్వారకలో జరిగే సంబరాల్ని ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఇక్కడి ఆలయాన్ని నిజమం దిరం, జగన్మందిరంగా పిలుస్తారు. 2,500 సంవత్సరాల క్రితం కృష్ణుడి మనుమడు వజ్రనాభుడు ఈ గుడిని కట్టాడని చెబుతారు. కృష్ణాష్టమి రోజు లక్షల జనం వస్తారిక్కడికి. కర్ణాటక ఉడుపిలోని విగ్రహమూర్తి అయితే సాక్షాత్తూ రుక్మిణీదేవితో పూజలందుకున్నట్టు పురాణాలు చెబుతున్నాయి.

### తిరుమలలో...

తిరుమల శ్రీవారి సన్నిధిలో బాలకృష్ణుడి విగ్రహం ఉంటుంది. అందుకే అష్టమినాడు తిరుమలలో 'గోకులాష్టమీ ఆస్థానా'న్ని నిర్వహిస్తారు. ఆ రోజు కృష్ణుడు సర్వభూపాల వాహనం మీద మాడవీధుల్లో ఊరేగుతాడు. పండితులు భాగవతంలోని ఘట్టాలనూ, అందులోని కన్నయ్య లీలలనూ శ్రావ్యంగా చదివి వినిపిస్తారు. శిక్యోత్సవం పేరుతో ఉట్ల పండగ చేస్తారు. మహారాష్ట్రలో కూడా ఘనంగా కృష్ణజయంతిని జరుపుతారు. అక్కడ 'దహీహండీ' పేరుతో ఉట్ల పండగను అట్టహా సంగా నిర్వహిస్తారు. ఈ పూజలూ వేడుక లన్నీ కన్నయ్యను మన దగ్గరికీ, మనింట్లోకీ ఆహ్వానించడానికే. కిలోల బంగారానికి తూగని వాడు ఒక్క తులసీదళానికే తేలి పోయాడు. ఆ తత్వం మనకూ బోధపడితే కన్నయ్య మనవాడే... మనందరివాడే! ★

# ఆలూబుఖారాతో ఆరోగ్యమెంతో..!



**కొం**చెం పుల్లగా మరికొంచెం తియ్యగా ఉండే ఆలూబుఖారా(ప్లమ్) పండ్లు అన్ని కాలాల్లోనూ దొరకవు. పైగా వచ్చినప్పుడు కూడా వాటిని చాలామంది పెద్దగా పట్టించుకోరు. కానీ అవి ఆరోగ్యానికి ఎంతో మంచివి అంటున్నారు ఆరోగ్యనిపుణులు. ఎందుకంటే అవి కాలేయం, రొమ్ము, పేగు క్యాన్సర్లను నివారిస్తాయట. అదెలా అంటే క్యాన్సర్ రోగుల్లో కూడా ఆయా కణాలు పెరగకుండా ఉండేలా చూస్తాయి. అంతేకాదు, కీమోథెరపీ కారణంగా తలెత్తే దుష్ఫలితాలనీ తగ్గిస్తాయి.

★ ఎముక సాంద్రత తక్కువగా ఉండి ఆస్టియోపోరోసిస్‌తో బాధపడుతోన్న వాళ్లు ఎండు పండ్లను తీసుకోవడం వల్ల ఫలితం ఉంటుంది. ముఖ్యంగా వృద్ధులు ప్రతిరోజూ వీటిని తినడం వల్ల ఎముకలు ఆరోగ్యంగా ఉంటాయి.

★ ఆలూబుఖారా పండ్లు కొలెస్ట్రాల్‌నీ తగ్గిస్తాయి. వీటిల్లో కె-విటమిన్ శాతం ఎక్కువగా ఉండటంతో గుండెజబ్బులు రాకుండా ఉంటాయి. అంతేకాదు, వీటిల్లోని ఫ్లేవొనాయిడ్లు ఊబకాయాన్నీ నిరోధిస్తాయి.

★ బాగా అలసిపోయి నీరసపడినప్పుడు రోజూ ఓ ఐదు పండ్లను తీసుకోవడంవల్ల వెంటనే శక్తిని పుంజుకోవచ్చు. ఎందుకంటే వీటివల్ల బిగదీసుకున్న కండరాలు తిరిగి యథా స్థితికి రావడంతో అప్పటివరకూ కణాల మధ్య పేరుకున్న ఒత్తిడి తగ్గుతుంది.

★ ఆలూబుఖారాలు జీర్ణవ్యవస్థకీ ఎంతో మంచివి. మలబద్ధకాన్ని తగ్గించడంతోబాటు వీటిలోని ఇసాటిన్, సార్బిటాల్... వంటి పదార్థాలు టాక్సిన్లు బయటకు పోయేలా చేస్తాయి. అంతేకాదు, ఈ పండ్లు జీవక్రియా వేగాన్నీ పెంచుతాయి. వీటిల్లో పీచూ ఎక్కువే. ఇంకా వీటిల్లోని విటమిన్-సి చర్మ ఆరోగ్యానికీ సౌందర్యానికీ కూడా తోడ్పడుతుంది.

# భలే మంచి లైటు!

**ఆ**ఫీసుల్లో సీరియస్‌గా పనిచేస్తుంటే మధ్యమధ్యలో పక్కసీటువాళ్లో మరో సెక్షన్ వాళ్లో వచ్చి అంతరాయం కలిగిస్తుంటారు. ఆ పని మధ్యలో వదిలి వాళ్లతో మాట్లాడాల్సి రావడం కొన్ని సందర్భాల్లో చాలా ఇబ్బందిగా అనిపిస్తుంటుంది. అందుకే అలాంటి సమస్య లేకుండా ఉండేందుకు యూనివర్సిటీ ఆఫ్ కొలంబియాకు చెందిన పరిశోధకులు 'ఫ్లో లైట్' పేరుతో ఓ ఎల్ ఈడీ పరికరాన్ని రూపొందించారు. కంప్యూటర్‌కు అనుసంధానించిన ఈ లైటు, మనం పనిలో ఉండటాన్ని గుర్తించి దానంతటదే ఎరుపు రంగులోకి పనయిపోయి కాస్త ఫ్రీ కాగానే ఆకుపచ్చరంగులోకి మారుతుంటుందట. అదెలా అంటే- కీబోర్డు, మౌస్‌లమీద ఆయా వ్యక్తుల చేతి వేళ్ల కదలికల వేగాన్నీ బట్టి వాళ్లు పనిలో ఉన్నారన్న విషయాన్ని గుర్తించి ఎరుపురంగులోకీ, ఆ వేళ్ల కదలికల వేగం తగ్గిపోయాక ఆకుపచ్చరంగులోకీ మారిపోతుంది. ఇప్పటికే 15 ఆఫీసుల్లో దీన్ని పరిశీలించి చూడగా మంచిఫలితాలే కనిపించాయట. అంతేకాదు, దీని కారణంగా అంతరాయం కలగడం యాభైశాతం వరకూ తగ్గడంతో పాటు అంతా తమ సమయంతో సహా మరొకరి సమయం విలువనీ గుర్తించి మసలుకుంటున్నారట. మంచి ఆలోచన కదూ!






# ఆనందంతో ఆరోగ్యం!



**అ**నుకోకుండా ఎక్కువ ఆశ్చర్యం, ఆనందం కలిగినప్పుడు ఒక రకమైన భావోద్వేగానికి లోనవుతాం. ఆ అనుభూతి శరీరానికీ మెదడుకీ నూతనోత్తేజాన్ని అందిస్తుందని పేర్కొంటున్నారు కాలిఫోర్నియా విశ్వవిద్యాలయానికి చెందిన నిపుణులు. ఉదాహరణకి ప్రకృతిలోని అందాల్ని చూస్తున్నప్పుడో, రోజువారీ జీవితంలో ఏదైనా అనుకోని ఆనందకరమైన సంఘటనలు చోటు చేసుకున్నప్పుడో లేదా నచ్చిన మనుషుల్ని ఆకస్మికంగా కలిసినప్పుడో అత్యధిక ఆనందాన్నీ ఆశ్చర్యాన్నీ పొందుతాం. అయితే అలా సంభ్రమాశ్చర్యాల్ని కలిగించే సంఘటనలు ఎప్పుడోగానీ సంభవించవు. కాబట్టి, నిత్యజీవితంలో ఎదురయ్యే ప్రతీ చిన్న సంతోషకరమైన సంఘటనలోనూ తప్పొప్పుల్ని ఎంచుతూ కూర్చోకుండా చిన్నపిల్లల్లా ఆనందించాలి అంటున్నారు సదరు నిపుణులు. అంతేకాదు, ఆనందాన్ని కలిగించే ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించేందుకు తరచూ పర్యటిస్తుండాలి. అప్పుడు మనసూ శరీరమూ రెండూ ఏకకాలంలో సేదతీరడంతోబాటు కొత్త ఉత్సాహాన్నిస్తాయి అని సూచిస్తున్నారు.

## టూకీగా...

**మ**నం కూర్చునే భంగిమ నిటారుగా ఉంటే హార్మోన్ల సమన్వయం సరిగ్గా ఉండటంతోబాటు, ఆనందాన్ని కలిగించే సెరటోనిన్ శాతం పెరిగి, ఒత్తిడిని పెంచే కార్టిసాల్ శాతం తగ్గుతుందనేది వాషింగ్టన్ యూనివర్సిటీ పరిశోధకుల అధ్యయనం.

★ అల్లాన్ని వంటల్లో భాగంగా గానీ టీ ద్వారాగానీ తీసుకోవడంవల్ల అందులోని జింజరాల్ అనే పదార్థం, ఊపిరితిత్తులూ శ్వాసనాళాల్లోని కాలుష్య పదార్థాలను బయటకు పంపించేందుకు తోడ్పడుతుందని కాలిఫోర్నియా యూనివర్సిటీ నిపుణుల ఉవాచ.

# ఆకుకూరలతో తెలివితేటలు!

**వ**యసుతోపాటు మెదడు చురుకుదనం కూడా తగ్గుతుంటుంది. తద్వారా ఆలోచించే శక్తీ తెలివితేటలూ కూడా నెమ్మదిస్తాయి. వృద్ధులు ఆలస్యంగా స్పందించడానికి అదే కారణం. మనం ఏదయినా ప్రశ్న అడిగినప్పుడో లేదా మాట్లాడేటప్పుడో అది వాళ్ల మెదడుకి చేరి, తిరిగి దానికి స్పందించడానికి కొంత సమయం పడుతుంది. అలా జరగకుండా ఉండాలంటే ల్యూటెన్ సమృద్ధిగా ఉండే ఆకుకూరలూ, అవకాడో, గుడ్లూ... వంటివి ఎక్కువగా తీసుకుంటే మెదడూ శరీరమూ రెండూ చురుగ్గా పనిచేస్తాయని యూనివర్సిటీ ఆఫ్ ఇల్లినాయిస్‌కు చెందిన పరిశోధకులు పేర్కొంటున్నారు. ఇందుకోసం వీళ్లు కొందరు యువకుల్నీ, మరికొందరు మధ్యవయస్కుల్నీ ఎంపిక చేశారట. కొన్ని నెలలపాటు మధ్యవయసు వాళ్లకు ఆకుకూరల్నీ గుడ్లనీ అవకాడో రసాన్నీ ఇచ్చి, తరవాత ఇరు వర్గాల్లోనూ నరాల స్పందనని పరిశీలించగా- యువకుల్లోకన్నా మధ్యవయసువాళ్లే చురుగ్గా ఉన్నట్లు గుర్తించారు. దీన్నిబట్టి ఆకుకూరల్లోని ల్యూటెన్ అధ్యయనశక్తినీ జ్ఞాపకశక్తినీ పెంపొందిస్తుందని విశ్లేషిస్తున్నారు.





ప్రపంచంలో ఉన్నవన్నీ మహాభారతంలో ఉన్నాయి. మహాభారతంలో ఉన్నవన్నీ ఆఫీసులోనూ ఉన్నాయి. ఎందుకంటే, ప్రపంచంలో ఆఫీసు ఓ భాగం కాబట్టి, ఆఫీసు కూడా ఓ చిన్నసైజు ప్రపంచమే కాబట్టి! ఉద్యోగంలో చేరిన తొలిరోజే, గడ్డం దువ్వుకుంటూ గంభీరంగా ఓ పెద్దమనిషి ఎదురొస్తాడు. 'భీష్మ పితామహుడిలా ఉన్నాడే!' అనుకుంటాం. వంకరచూపులతో ఓ వెధవాయి తారసపడతాడు. 'జాగ్రత్త, శకునిమామ లాంటోడు!' అని అంతరాత్మ హెచ్చరిస్తుంది. కొన్ని క్యారెక్టర్లంతే. మర్యాదగా నమస్కారం పెట్టినా స్వీకరించరు. 'నేనేమిటీ నా స్థాయేమిటీ?' అన్న అహంభావం. అలాంటి వాళ్లది దుర్యోధన మనస్తత్వం. ఇలా, బేరీజు వేసుకుంటూ పోతే...భారతంలోని ప్రతి పాత్రా ఏదో ఓ సీట్లో తారసపడుతుంది. ఎవరు ధర్మనందనుడో, ఎవరు మధ్యమపాండవుడో, ఎవరు దుర్యోధనుడో, ఎవరు దుశ్శాసనుడో...ఓ అవగాహనకు రాగలిగితే ఇక తిరుగుండదు. అమాయక అభిమన్యు కుమారుడిలా ఆఫీసు పద్మవ్యూహంలో చిక్కుకోం. పొరపాటున చిక్కుకున్నా ఒడుపుగా ఒడ్డునపడతాం.

# ఆఫీస్... మహాభారత్!

## 'చక్రం' తిప్పేస్తాడు!

వాసుదేవ కృష్ణుడు సర్వాంతర్యామి, జగన్నాటక సూత్రధారి, ధర్మపక్షపాతి. పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం... మంచితనానికీ మంచి మనుషులకూ అండగా నిలబడటం, దుర్మార్గాన్నీ దుర్మార్గులనూ నిలువరించడం...ఆయన ప్రధాన కర్తవ్యాలు. ఆ ప్రయత్నంలో అర్జునుడికి కర్తవ్యాన్ని బోధించాడు, భీముడికి దుర్యోధనుడిని జయించే మార్గం చెప్పాడు, వీరాధివీరుడైన కర్ణుడిని అన్నివిధాలా బలహీనపరిచాడు, అంతిమంగా పాండవుల్ని గెలిపించాడు, ధర్మాన్ని సంస్థాపించాడు. కృష్ణుడి పాత్రను కార్పొరేట్ ఆఫీసుకు అన్వయించుకుంటే - అతడు, చీఫ్ స్ట్రాటజీ ఆఫీసర్...తిరుగులేని వ్యూహాన్ని రచిస్తాడు. చీఫ్ నాలెడ్జ్ ఆఫీసర్...అనుచరులకు కర్తవ్యదీక్షోపదేశం చేస్తాడు. చీఫ్ రిలేషన్‌షిప్ ఆఫీసర్...నమ్మినవారికి అండగా నిలుస్తాడు.

పాండవ సైన్యం కంటే కౌరవ పటాలమే పెద్దది. ఆయుధ సంపత్తి కూడా ఎక్కువే. కానీ పాండవులే గెలిచారు. కారణం, పాండవుల వైపు శ్రీకృష్ణుడనే 'చీఫ్ మోటివేటర్' ఉన్నాడు. సిబ్బందిలో ఉత్సాహాన్ని నింపి.. .తక్కువ వనరులతో ఎక్కువ ఫలితాన్ని రాబట్టడం అతడికి బాగా తెలుసు. మొత్తంగా శ్రీకృష్ణుడు చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ కమ్ చీఫ్ ఆపరేటింగ్ ఆఫీసర్. యత్ర యోగేశ్వర కృష్ణ...ఎక్కడ అలాంటి సమర్థ నాయకుడు ఉంటాడో అక్కడ విజయం ఉంటుంది. అలాంటి మేధోసంపన్నుల నాయకత్వంలో ఏ సంస్థ అయినా అనతికాలంలోనే 'బిలియన్ డాలర్' స్థాయికి చేరుతుంది. ఫోర్బ్స్ ఉత్తమ కంపెనీల జాబితాలో నిలబడుతుంది.

ఉద్యోగులుగా మనకు అలాంటి అధినాయకుడు తారసపడినప్పుడు...ఆ గొప్పదనాన్ని గుర్తించాలి, గౌరవించాలి. పడకసీనులో కృష్ణుడు 'బావా...కోరుకో!' అనగానే, దుర్యోధనుడు లక్షల సైన్యాన్ని కోరుకున్నాడు. అర్జునుడేమో కృష్ణుడి సారథ్యాన్నీ సాన్నిధ్యాన్నీ ఎంచుకున్నాడు. అలాంటి సందర్భమే ఎదురైతే, అర్జునుడిలా ఆలోచించడమే తెలివైన పని.



## చాలా...పెద్దాయన!

భీష్మపితామహుడు కురువంశానికి పునాది. తన చేతుల మీదుగా ఓ సామ్రాజ్యాన్ని నిర్మించాడు. ఎప్పుడూ పదవులూ హోదాలూ కోరుకోలేదు. తండ్రి శంతనుడికి ఇచ్చిన మాట ప్రకారం, కురుసామ్రాజ్యానికి ధర్మకర్తగా మాత్రమే వ్యవహరించాడు. తనముందే పుట్టిపెరిగిన కౌరవ కుర్ర కుంకలు కూడా చులకన చేసి మాట్లాడుతున్నా సహించాడూ భరించాడూ. ఆ మమకారంతోనే మహాభారత సంగ్రామంలో కౌరవసైన్యానికి నాయకత్వం వహించాడు. చివరికి, అర్జునుడి శరాఘాతాలకు కూలిపోయాడు. ఆ స్థాయి వ్యక్తులు అరుదుగా అయినా, అక్కడక్కడ దర్శనమిస్తుంటారు. కంపెనీకి అతనే పెద్దదిక్కనే ప్రచారం ఉంటుంది. ఆ పెద్దాయనంటే సిబ్బందికి బోలెడంత గౌరవం కూడా. షెడ్డులో మొదలైన వ్యాపారం అద్దాల మేడకు చేరుకునే దాకా...ప్రతి మలుపులోనూ ఆయన పాత్ర ఉండితీరుతుంది. ఏ కీలక నిర్ణయం తీసుకోవాలన్నా ఓమాట అడుగుతారు. ఇదంతా పైపైకి కనిపించే దృశ్యం. కనిపించని కోణమూ ఒకటుంటుంది. ఆయన్ని సలహా అడగడం నిజం, చెప్పినదానికల్లా తలూపడమూ నిజమే. కానీ, వాటిని ఆచరణలో పెట్టిన సందర్భాలు అరుదే. చివరికొచ్చేసరికి తాము చేయాలనుకున్నదేదో చేసేస్తారు.

కౌరవ సభలో దుర్యోధన దుశ్శాసనుల అకృత్యాల్లా...ఆఫీసులో తెరవెనుక రాజకీయాలు పెద్దాయనకు తెలియనివి కాదు. పతనమవుతున్న పనిసంస్కృతీ, దారితప్పుతున్న క్రమశిక్షణా ఆ అనుభవ సంపన్నుడి దృష్టికి వెళ్లవనీ అనుకోలేం. సంస్థ మీద మమకారం కొద్దో, యాజమాన్యం పట్ల కృతజ్ఞతతోనో ఇంకా కొనసాగుతూ ఉంటారు. అవకాశం ఉంటే, ఇలాంటి పెద్దల్ని దర్శించుకుని దండం పెట్టుకోవచ్చు. ఓపిక ఉంటే, సంస్థ విజయ రహస్యాల్నీ ఆ యోధుడి జీవితానుభవాల్నీ 'భీష్మబోధ'లా ఆలకించవచ్చు.



## అతడి దారి...'అడ్డదారి'!

కర్ణుడు వీరాధివీరుడు, మహాదాత. కథానాయకుడికి ఉండాల్సిన గొప్ప లక్షణాలన్నీ ఉంటాయి. కానీ, సహవాస దోషంతో సర్వభ్రష్టుడు అవుతాడు. కార్యాలయాల్లో కర్ణుడి అంశ కనిపిస్తూ ఉంటుంది. ఇలాంటివాళ్లు ఐఐటీలూ, ఐఐఎమ్‌లలో చదువుకుని ఉండకపోవచ్చు. కానీ ఆ స్థాయి నైపుణ్యం ఉంటుంది. కష్టపడి పనిచేస్తారు. తమ ప్రతిభను గుర్తించి, అవకాశం ఇచ్చినవారి పట్ల మహా నమ్మకంగా ఉంటారు - ఆ అతి విధేయత వల్ల కంపెనీ ప్రతిష్ఠకు భంగం కలుగుతుందని తెలిసినా, తమ వ్యక్తిత్వానికి మచ్చపడే ప్రమాదం ఉన్నట్టు స్పష్టంగా అర్థం అవుతున్నా..అస్సలు పట్టించుకోరు. ఫలితంగా, కవచ కుండలాల్లాంటి సహజ నైపుణ్యాలు మరుగున పడిపోతాయి. ఏదో ఓరోజు...గతంలో చేసిన తప్పులన్నీ బాణాలై గుచ్చుకుంటాయి. కార్పొరేట్ రణక్షేత్రంలో కుప్పకూలిపోతారు. మంచి స్నేహితుడిని ఎంచుకుని ఉంటే, కర్ణుడి కథ మరోలా ఉండేదేమో. కెరీర్ క్షేత్రంలో నువ్వు ఎవరన్నది ఎంత ముఖ్యమో, ఎవరితో రాసుకు పూసుకు తిరుగుతున్నావన్నదీ అంతే ముఖ్యం!



## బంధాల అంధుడు!

ధృతరాష్ట్రుడికి పుట్టుకతోనే కళ్లు లేవు. పిల్లలు పుట్టాక మనసుకూ అంధత్వం వచ్చింది. కొడుకు మీదున్న మితిమీరిన మమకారమే భయంకరమైన బలహీనతగా మారింది. అదే కౌరవవంశాన్ని నిండా ముంచేసింది. సిబ్బందిని మంచి వైపు నడిపించాల్సిన బాసు...మిన్నకుండిపోతే ఎన్ని ఘోరాలు జరుగుతాయో చెప్పడానికి కౌరవసంతతి వినాశనమే తార్కాణం. కార్పొరేట్ సామ్రాజ్యాల్లో గుడ్డిదర్బార్లకు కొదవ ఉండదు. కొందరు పెద్దబాసులు ఏవో మమకారాలతో అనర్హుల్ని అందలం ఎక్కిస్తుంటారు. అసమర్థులకు ముఖ్య బాధ్యతలు కట్టబెడుతుంటారు. ఆ కౌరవ సంతతి వల్లే వ్యవస్థ బీటలువారుతున్నట్టు అర్థమౌతున్నా, నిమ్మకు నీరెత్తినట్టు ప్రవర్తిస్తారు. విదురుడి లాంటి పెద్ద మనిషో, కృష్ణుడిలాంటి మేధావో వాస్తవాల్ని వివరించినా, ఆ నిఖార్సయిన నిజాల్ని జీర్ణించుకోలేరు. మంచి చెప్పినవాళ్ల మీదే మసిపూస్తుంటారు. ఆ ధృతరాష్ట్ర కౌగిలికి ఎంత దూరం ఉంటే అంత మంచిది. అలాంటి 'హెడ్ ఆఫ్ ద డిపార్ట్‌మెంట్' దగ్గర కొలువంటే పాముతో చెలగాటమే.



## 'ధర్మ'రాజే కానీ....

అపారమైన మేధస్సు, అణువణువునా నిబద్ధత - ఇదీ ధర్మరాజు వ్యక్తిత్వం. వెనకాల 'అన్నా! నువ్వెలా అంటే అలా...' అనే నలుగురు తమ్ముళ్లూ, పక్కనే 'బావా నేనున్నా...' అంటూ ధైర్యమిచ్చే శ్రీకృష్ణుడూ, 'అదిగో ధర్మనందనుడు' అంటూ చేతులు జోడించే మహా జనమూ - ఇంకేం కావాలి? అన్నీ ఉన్నా...జూదమనే బలహీనతే అడవుల పాలు చేసింది. అచ్చంగా ధర్మరాజును తలపించే పాత్రలు ఆఫీసు కారిడార్లలో కనిపిస్తాయి. బుర్రనిండా విషయం ఉంటుంది. బోలెడంత నైపుణ్యం ఉంటుంది. అపార అనుభవమూ ఉంటుంది. కానీ, ఏవో చిన్న చిన్న వ్యసనాలు. ఆఫీసులో కూర్చుని ఆన్‌లైన్లో పోకర్ ఆడుతుంటారనో, క్యాంపుల సాకు చెప్పి, రేసులకు వెళ్తారనో ఒకట్రెండు ప్రచారాలు వినిపిస్తూ ఉంటాయి. మంచి ఎక్కడున్నా స్వీకరించాల్సిందే. ఆ ప్రకారంగా, ధర్మనందనుల నుంచి నేర్చుకోవాల్సిన పాఠాలేమైనా ఉంటే తప్పకుండా నేర్చుకోవాలి. ఆ బలహీనతలు మనల్ని తాకకుండా జాగ్రత్తపడితే చాలు.



## ధైర్యం విసిరిన పాశుపతం!

'రేపే డెడ్‌లైన్. టెండరు కాగితాలు సిద్ధంగా ఉన్నాయా?'

'ఎస్ సర్! ఆ బాధ్యత మిస్టర్ ఎక్స్ చూస్తున్నాడు'

'ముఖ్యమైన కాన్ఫరెన్స్. ప్రజెంటేషన్ అదిరిపోవాలి'

'తప్పకుండా సర్! మిస్టర్ ఎక్స్ ఆ పన్లోనే ఉన్నాడు'

ఆ ఎక్స్ పేరు ఏదైనా కావచ్చు - అర్జున, పార్థ, కిరీటి, ఫల్గుణ! ప్రతి ఆఫీసులో అర్జునుడిలాంటి కత్తిలాంటి ఉద్యోగులు ఒకరో ఇద్దరో ఉంటారు. ప్రతిష్ఠాత్మకమైన ప్రాజెక్టులు వచ్చిన ప్రతిసారీ సీఈవో ఆఫీసు నుంచి వాళ్లకే ఫోన్లు వెళ్తాయి. సమస్యో సంక్షోభమో ఎదురైనప్పుడు కూడా వాళ్లనే 'ట్రబుల్ షూటర్స్'గా బరిలో దింపుతారు. అర్జునుడు రెండు చేతులతోనూ బాణాలు వేయగలడు, 'మల్టీ టాస్కింగ్' నిపుణుడన్నమాట. చెట్టునూ కొమ్మనూ పక్షినీ పట్టించుకోకుండా పక్షి కనుగుడ్డుకే గురిపెడతాడు, 'ఫోకస్' అపారమని అర్థం. మత్స్యయంత్రాన్ని ఛేదించి మరీ సాధించిన ద్రౌపదిని మిగతా సోదరులతో పంచుకున్నాడు, 'టీమ్‌స్పిరిట్' ఎక్కువని తెలుస్తోంది. లక్ష్య సాధనలో భాగంగా శిఖండి వేషమూ కట్టాడు, 'గో-గెటర్' అని తెలిసిపోతుంది. అన్నింటికీ మించి, శ్రీకృష్ణుడికి అత్యంత ఆప్తుడు. ఇక చెప్పేదేముంది, బలమైన 'మెంటార్' ఉండనే ఉన్నాడు. కార్పొరేట్ సంస్థలు అచ్చంగా ఇలాంటి వాళ్ల కోసమే హెచ్ఆర్ హంట్స్ నిర్వహిస్తాయి. ఎక్కడున్నా సరే, ఎంత జీతమిచ్చి అయినా సరే తన్నుకుపోతాయి. ఏ వేయిమందో పనిచేసే చోట...అర్జున్‌బాబులు ఒకరో ఇద్దరో ఉంటారు. అలా కనిపించేవాళ్లూ, కనిపించాలని ప్రయత్నించేవాళ్లూ మాత్రం బోలెడంతమంది. నకిలీల్ని చూసి మోసపోకండి!



## నిలువెల్లా విషమే!

శకుని...గాంధారి సోదరుడు. దుర్యోధన, దుశ్శాసనాదులకు మేనమామ. మహాభారతంలోని 'ఫోర్ ఇడియట్స్'లో ఒకడు. మహాప్రమాదకారి. అతడికి కురువంశం అంటే మంట! ఆ కుటుంబాన్ని నామరూపాల్లేకుండా చేయాలని కలలు కంటుంటాడు. తనకంత శక్తి లేదనీ పోరాడి గెలవడం అసాధ్యమనీ శకునికి తెలుసు. దీంతో, దొడ్డిదారి ఎంచుకున్నాడు. దుర్యోధనుడికి ఆప్తుడిలా నటిస్తూ అగ్గిరాజేశాడు. దాయాదుల పోరును మహా సంగ్రామం దాకా తీసుకెళ్లాడు. కార్పొరేట్ కార్యాలయాల్లో శకుని రకరకాల వేషాల్లో దర్శనమిస్తాడు. కొన్నిసార్లు సహోద్యోగి రూపంలో, కొన్నిసార్లు సీనియర్ అవతారంలో, ఇంకొన్నిసార్లు సాక్షాత్తూ బాసే ఆ పాత్ర ధరించవచ్చు. ఆ బాపతు మనుషులు ఆత్మీయుల్లా నటిస్తూ, ప్రేమగా పలకరిస్తూ ఎదుటివారి బలాల్నీ బలహీనతల్నీ తెలుసుకుంటారు. బలహీనతల్ని యాజమాన్యానికి భూతద్దంలో చూపుతారు. బలాల్ని బలహీనతల్లా వక్రీకరిస్తారు. ఫిర్యాదులూ పితూరీలూ ఆధునిక శకునిమామల మాయా పాచికలు!



## భీమ... పవర్ ఆఫ్ హార్డ్‌వర్క్!

పాండవ ద్వితీయుడు మహాబలవంతుడు. ఎంతటి బలమంటే... చిన్నప్పుడోసారి కొండ మీది నుంచి జారిపడ్డాడు. అయినా, పసివాడు నిక్షేపంగానే ఉన్నాడు. బండ మాత్రం ముక్కలుచెక్కలైపోయింది. బాల్యంలో, తోటి పిల్లలంతా చెట్టెక్కి పండ్లు తెంచుకుంటే...భీముడు కాండాన్ని పెకిలించి కాయలు రాల్చేవాడు. బుద్ధిబలం తోడైతేనే ఆ కండబలానికి సార్థకత. ఆ దిశానిర్దేశం కృష్ణుడి రూపంలో దొరికింది. కృష్ణుడే... జరాసంధుడిని ఎలా సంహరించాలో చెప్పాడు, దుర్యోధనుడిని ఎక్కడ దెబ్బకొట్టాలో సూచించాడు. కార్పొరేట్ పర్వంలోనూ అభినవ భీమసేనులు దర్శనమిస్తూ ఉంటారు. బండెడు చాకిరీని ఒంటిచేత్తో చేసేస్తారు. మహామహా ప్రాజెక్టుల్ని డెడ్‌లైన్‌లోపే పూర్తిచేస్తారు. కాకపోతే, వీళ్లకో మార్గదర్శకుడంటూ కావాలి. ఆ అండ దొరికిందా, గండరగండలే! లేదంటే, ఆ 'ఎనర్జీ' అంతా వృథా అయిపోతుంది. ఆ అపారశక్తిని సమర్థంగా వాడుకోవాల్సిన బాధ్యత కార్పొరేట్ కృష్ణ పరమాత్ములదే! అప్పుడప్పుడూ ఈ భీమసేనరావుల్ని 'నిదురవోచుంటివో లేక బెదిరి పలుకుచుంటివో...' తరహా ఎత్తిపొడుపులతో రెచ్చగొడుతూ ఉండాలి. లేకపోతే బర్గర్లూ పిజ్జాలూ తిని, బేఫికర్‌గా కునుకులోకి జారుకుంటారు.



## దుష్ట ఇగోయిస్టు!

దుర్యోధనుడి చుట్టూతా దురభిమానం వైఫైలా వ్యాపించి ఉంటుంది. పాండవుల్ని మట్టుబెట్టడానికి సుయోధనుడు చేయని ప్రయత్నమంటూ లేదు. విష ప్రయోగం చేస్తాడు, అగ్నికి ఆహుతివ్వాలనుకుంటాడు, మాయాజూదంలో ఓడించి అడవులకు పంపుతాడు, చివరికి, మడుగుపక్కన...భీముడి గదాదండం దెబ్బకి రక్తపుమడుగులో తుదిశ్వాస వదుల్తాడు. కార్పొరేట్ కారిడార్లలో ఇలాంటి దురహంకారులకు కొదవ ఉండదు. అందరూ తమచుట్టే తిరగాలనుకుంటారు. అన్నీ తాము అనుకున్నట్టే నడవాలనుకుంటారు. అందర్నీ శాసించాలనుకుంటారు. వ్యవస్థను ఆడించాలనుకుంటారు. అందుకోసం ఎన్ని కుట్రలైనా చేస్తారు. ప్రతిభావంతుల్ని నయానో భయానో తమ బృందంలోకి లాక్కోవాలని చూస్తారు. కుదరకపోతే...ప్రలోభాలతో లొంగదీసుకునే ప్రయత్నం చేస్తారు - కర్ణుడికి సామంత పదవి ఎర జూపినట్టు. ఎదుటివారి బలహీనతల్ని భలేగా వాడుకుంటారు - ధర్మరాజును జూదానికి రప్పించినట్టు. అయినా, ఆ ఆటలు ఎంతోకాలం సాగవు. చివరికి మంచే గెలుస్తుంది. సమర్థులకు న్యాయం జరుగుతుంది.



## 'శబ్ద' కాలుష్యమే!

ఉత్తరుడి మాటలు కోటల్ని దాటతాయి. చేతలు గడప కూడా దాటవు. గోగ్రహణ సమయంలో... 'నేనే కనుక రంగంలోకి దిగితేనా, కౌరవసేనలు కాలికి బుద్ధిచెప్పాల్సిందే..' అని బీరాలు పలుకుతారు. తీరా రణక్షేత్రానికి వెళ్లాక...శత్రుసైన్యాన్ని చూసి గడగడా వణికిపోతాడు. అర్జునుడి వెనకెళ్లి దాక్కుంటాడు. ఉత్తరుడిని తలపించే పాత్రలు ఆఫీసుల్లో చాలానే ఉంటాయి. 'నాకే ఆ ప్రాజెక్టు అప్పగిస్తేనా...' అని గొప్పలు చెబుతుంటారు. 'మేనేజ్‌మెంట్‌కు నేనెంత చెబితే అంతే' అని ప్రగల్భాలు పలుకుతుంటారు. 'నా హయాంలో అయితేనా..' అంటూ ఫ్లాష్‌బ్యాకులు చూపిస్తారు. అంతా ఒట్టిదే! చెరువు ఉందని చెప్పిన దగ్గర, బురద నీళ్లు కూడా కనిపించవు. ఉత్తరకుమారులు దుర్మార్గులేం కాదు కానీ...మన సమయాన్ని మింగేస్తారు, మన బుర్రల్ని తినేస్తారు. క్యాంటీన్‌లో వన్-బై-టూ చాయ్ వరకూ ఫర్వాలేదు, కాసేపు ఉచిత వినోదం!



## కార్పొరేట్ నారి

కార్పొరేట్ మేడల్లో కనిపించని అడ్డుగోడలేవో ఉంటాయి. మహిళ ఓ స్థాయికి మించి ఎదగకుండా అడ్డుకునే ప్రయత్నాలు జరుగుతుంటాయి. అయినా సరే, మడమతిప్పకూడదు, పరుగు ఆపకూడదు - ద్రౌపదిలా. ఆ పాండవపత్ని సంక్షోభ సమయాల్లోనూ స్థైర్యం వీడలేదు. నిండుసభలో అవమానాన్ని భరించింది, విరాటుడి కొలువులో దాసిగా పనిచేసింది. ఓ దశలో పాండవులు దుర్యోధనుడితో సర్దుకుపోదామనుకున్నారు. అదే జరిగితే, ఏ ఐదూళ్లతోనో రాజీపడితే, తాత్కాలికంగా కష్టాలు తీరతాయి. దుర్యోధనుడి రక్తంతో తలంటుకుంటానంటూ నిండుసభలో చేసిన ప్రతిజ్ఞ నెరవేరదు. అన్నివైపుల నుంచీ బేరీజు వేశాక, ద్రౌపది ఆ రాజీప్రతిపాదనను తిప్పికొట్టింది. 'ఇదేనా మీ వీరత్వం?' అంటూ భర్తల్లో రోషాన్ని రగిలించింది. ముఖ్యనిర్ణయం తీసుకోవాల్సిన ప్రతి సందర్భంలోనూ పాండవులు ద్రౌపది సలహా తీసుకున్నారు. ఇదంతా, భార్యగానే కాదు... దక్షురాలిగా, వ్యూహకర్తగా సాధించుకున్న గౌరవమిది. నలుగురు మనుషులతో సమన్వయం చేసుకోవాల్సి వచ్చినప్పుడూ, ద్రౌపది ప్రదర్శించిన పరిణతే మహిళా మణులకో మేనేజ్‌మెంట్ పాఠం.



## నోస్టైల్...నార్మల్!

నకులుడు శాంతమూర్తి. సహదేవుడు విలువలకు ప్రతినిధి. మహాభారతంలో ఇద్దరూ చివరిదాకా అన్నల చాటు తమ్ముళ్లే. తమకంటూ సొంత శక్తిసామర్థ్యాలు ఉన్నట్టు నిరూపించిన సంఘటనలు చాలా అరుదు. ఆ కవలల్ని తలపించే ఉద్యోగులు కార్పొరేట్ భారతంలో నూటికి ఎనభైమంది. ఆ తరహా ఉద్యోగులు తెలివైనవాళ్లు, కష్టపడతారు, నిశ్శబ్దంగా తమపని తాము చేసుకుపోతారు. ఆఫీసు రాజకీయాలకు ఆమడంత దూరంలో ఉంటారు. మేనేజ్‌మెంట్ దృష్టిలో పడాలనో, కార్పొరేట్ పరుగులో ముందుండాలనో ఆరాటపడరు. ఒక్క మాటలో చెప్పాలంటే పనితప్ప మరో ప్రపంచం తెలియని అమాయక ఉద్యోగులు. ఇలాంటివాళ్లు ఆఫీసులోని రకరకాల శిబిరాల్లో...ఏ వర్గానికీ చెందరు కాబట్టి ప్రమోషన్లకు పెద్దగా ఆస్కారం ఉండదు. స్వతహాగా పనిమంతులే కాబట్టి, కొలువు ఊడే దుస్థితి రాదు. పాతికేళ్ల అనుభవం తర్వాత కూడా 'తదితరులు' కోవలోనే మిగిలిపోతారు.



## శిష్యులకే పెద్దపీట!

కార్పొరేట్ భారతంలో తలనెరిసిన ద్రోణాచార్యులు హెచ్‌ఆర్ విభాగాలకు నాయకత్వం వహిస్తుంటారు. ఎవర్లో ఏ చిన్న మెరుపున్నా ఇట్టే పట్టేస్తారు. కఠోర శిక్షణతో ఆ నైపుణ్యాలకు పదునుపెడతారు. అవకాశాలిచ్చి అందలం ఎక్కిస్తారు. ఆ తర్ఫీదులో వ్యక్తిగత స్వార్థమేం ఉండదు - 'నా శిష్యుడే..' అని చెప్పుకోవాలన్న ఆరాటం తప్ప! కానీ ఆ శిష్యవాత్సల్యం కొన్నిసార్లు అదుపుతప్పుతూ ఉంటుంది. ద్రోణుడికి అర్జునుడంటే ఎంత మమకారం అంటే, పార్థుడికి సాటివచ్చే వీరుడు భూమ్మీద ఉండకూడదనుకుంటాడు. ఏకలవ్యుడి విలువిద్యా నైపుణ్యాన్ని సహించలేకపోతాడు. గురుదక్షిణగా బొటనవేలు అడిగి, అడ్డు తొలగించుకుంటాడు. కార్పొరేట్ ద్రోణులదీ అదే స్వభావం. కీలకమైన పదవులన్నీ తమ శిష్యులకే దక్కాలనుకుంటారు. ఎవరు పోటీకొచ్చినా తొక్కిపడేస్తారు. మరో కంపెనీకి వెళ్లినా, శిష్యప్రశిష్య సమేతంగానే బయల్దేరతారు. సమర్థత వీరి బలం, 'నా...' అన్న సంకుచితత్వం పెద్ద బలహీనత.



## రెండు నాల్కలు...

శల్యుడు కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల వైపు పోరాడేందుకు బయల్దేరాడు. మధ్యలో దుర్యోధనుడు ఎదురై, అతిథి మర్యాదలు చేయగానే ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. మరునిమిషమే కౌరవపక్షంలో చేరిపోయాడు. 'ఎటూ వచ్చాం కదా, ఓసారి చూసిపోదాం' అని పాండవుల ఇంటికెళ్లాడు. ఆ కాసేపట్లోనే, ధర్మరాజు మంచితనానికి కరిగిపోయాడు. తనవంతు సాయం చేస్తానని పాండవులకు మాటిచ్చాడు. కర్ణుడి సారథిగా వెళ్లినవాడు....బుద్ధిగా తేరు తోలాడా అంటే, అదీ లేదు. సూటిపోటి మాటలతో బాధపెట్టాడు. 'పార్థుడెక్కడా, నువ్వెక్కడా? అర్జునుడి దెబ్బకు నువ్వు కుప్పకూలడం ఖాయం' అంటూ రాధేయుడి ఆత్మస్థయిర్యాన్ని దెబ్బతీశాడు. చివరికి, ధర్మరాజు చేతిలో కుక్కచావు చచ్చాడు. శల్యసారథ్యం...కార్పొరేట్ ఆఫీసుల్లో సర్వసాధారణమే. మనసులో ఒకటి. చేసేది ఒకటి. ఓ వర్గంలో ఉంటారు. మరో వర్గానికి మద్దతునిస్తారు. అస్సలు నిలకడ ఉండదు. ఇలాంటివారు, ఏ సీటులోనూ ఎక్కువకాలం ఉండరు, ఏ సంస్థలోనూ కుదురుగా పనిచేయరు.



## ఆ మాటే..మార్గసూచి!

విదురుడు - నీతిశాస్త్ర కోవిదుడు, నిండుసభలో ద్రౌపదీ వస్త్రాపహరణాన్ని నిరసించిన ఒకే ఒక్కడు. పాండవుల మీద సానుభూతి ఉన్నా, అంతిమంగా ధృతరాష్ట్రుడికే విధేయుడు. ఎందుకంటే, మంత్రిగా రాజు పట్ల విశ్వాసాన్ని ప్రదర్శించడం తన బాధ్యతని బలంగా భావించాడు. తనకు ధర్మమని తోచినదాన్ని పరోక్షంగానో, ప్రతీకాత్మకంగానో ధృతరాష్ట్రుడికి చెప్పి చూశాడు. తన పరిమితులు తనకు తెలుసు కాబట్టి, అంతకు మించి ఒత్తిడి చేయలేకపోయాడు. కార్పొరేట్ కంపెనీల్లో మానవ వనరుల విభాగం అధిపతులుగా, ముఖ్య సలహాదారులుగా ఈ విదురాంశ సంభూతులు తారసపడుతుంటారు. కంపెనీ విజన్ స్టేట్‌మెంట్ తయారు చేయడం, ట్రైనీ కుర్రాళ్లకు నాలుగు మంచి మాటలు చెప్పడం, అప్పుడప్పుడూ అధినేతకు ఉపన్యాసాలు రాసివ్వడం...వీళ్ల అదనపు బాధ్యతలు. ఉత్తమమైన సలహాలు ఇవ్వడం వరకే వీళ్ల పాత్ర. అవతలివారు, పాటించారా బాగుపడతారు. లేదంటే...



## దూకుడెక్కువ!

అభిమన్యుడు వీరాధివీరుడు. తండ్రి అర్జునుడికి తగిన తనయుడు. కౌరవుల్ని మట్టుబెడతానంటూ ఊగిపోతుంటాడు. ఆ దూకుడే దుర్యోధన బృందానికి వరమై కూర్చుంది. వీరావేశంలో, పద్మవ్యూహంలోకి వెళ్లడం వరకే తనకు తెలుసనే విషయాన్ని మరచిపోయాడు. ఫలితంగా, కర్ణుడి చేతిలో ప్రాణాలు కోల్పోయాడు. ఆఫీసుల్లో కొంతమంది కొత్త కుర్రాళ్లని చూసినప్పుడు అభిమన్యుడే గుర్తుకొస్తాడు. లేని బలాల్ని ఊహించుకుంటూ తల ఎగరేస్తుంటారు. శక్తికి మించిన పనుల్ని నెత్తినేసుకుని హంగామా సృష్టిస్తుంటారు. కొద్దిరోజులు ఆ హవా కొనసాగినా..దీర్ఘకాలంలో సీనియర్ల కుట్రకు బలైపోయి ప్రాధాన్యంలేని సీట్లకు మారిపోతారు, లేదంటే ఆ తలనొప్పులు భరించలేక మరో కంపెనీకి ఎగిరిపోతారు. విజయానికి వేగం ఒక్కటే సరిపోదు, వ్యూహమూ ఉండాలి. ఆ ఒక్క లోపాన్నీ సరిచేసుకుంటే అభినవ అభిమన్యు కుమారులు కార్పొరేట్ పద్మవ్యూహంలో చొచ్చుకుపోగలరూ, సురక్షితంగా బయటపడనూగలరు.



ఆఫీసులో...ఎవరు ఏ పాత్రలో ఇమిడిపోతారన్న అంచనా మంచిదే. అదే సమయంలో మనం ఏ పాత్రలో ఒదిగిపోగలమన్న మదింపూ ఉండాలి. 'మహాభారతంలోని వేలకొద్దీ అనామక పాత్రల్లా...ఏ ప్రాధాన్యం లేకుండా మిగిలిపోవాలా? 'మ్యాన్ ఆఫ్ ద ఎపిక్' అర్జునుడిలా మనదైన ప్రత్యేకత చాటుకోవాలా?' అన్నది ఎవరికివారు తేల్చుకోవాల్సిన విషయం.
ఆ నిర్ణయం మీదే కెరీర్ 'జయం' ఆధారపడి ఉంటుంది.
భారతానికి మరో పేరు... 'జయం'.





నరేంద్ర దామోదర్‌దాస్ మోదీ... దేశానికి ప్రధానమంత్రి, ఓ మంచి వక్త, తెలివైన రాజకీయ వ్యూహకర్త, తిరుగులేని నాయకుడు... ఇప్పుడు వీటన్నింటి పక్కన 'గొప్ప రచయిత' అన్న పదాన్నీ జోడించాలి. విద్యార్థులను ఉద్దేశించి మోదీ రాసిన ఓ పుస్తకం త్వరలో మార్కెట్లోకి రాబోతోంది. ఇప్పటిదాకా దేశంలోనే అత్యధిక కాపీలతో అచ్చవుతున్న పుస్తకం కూడా అదే. గతంలోనూ అనేక పుస్తకాల ద్వారా ఆయనలోని రచయితని మోదీ బయటపెట్టారు.

# కుర్రాళ్ల కోసం మోదీ పుస్తకం!




క్యాబినెట్ మీటింగులూ, విదేశీ పర్యటనలూ, బహిరంగ సభలూ, అధికార కార్యకలాపాలూ... ఇలా క్షణం తీరికలేకుండా గడిపే మోదీ, ఇటీవల విద్యార్థులను ఉద్దేశించి ఓ పుస్తకాన్ని రాశానని చెప్పినప్పుడు చాలామంది ఆశ్చర్యపోయారు. నిత్యం బిజీగా ఉండే వ్యక్తి పుస్తకం కోసం సమయం కేటాయించడం అభినందనీయమని అరుణ్‌జైట్లీ, సురేష్ ప్రభు లాంటి కొందరు ప్రముఖులు ప్రశంసించారు. పుస్తకంలో ఆయన ప్రస్తావించిన అంశాల గురించి తెలుసుకున్న 'పెంగ్విన్ ర్యాండమ్ హౌజ్' ప్రచురణ సంస్థ దేశంలోనే అత్యధికంగా ఒకేసారి పది లక్షలకుపైగా కాపీలను వేర్వేరు భాషల్లో అచ్చేయడానికి ముందుకొచ్చింది. గతంలోనూ ప్రధానులుగా పనిచేసిన చాలామంది పుస్తకాలు రాసినా, పదవిలో ఉండగానే ఆ పని చేస్తున్న తొలి వ్యక్తి మోదీనే.

★ పదో తరగతి, ఇంటర్... విద్యార్థులు ఎక్కువ ఒత్తిడికి గురయ్యే దశ ఇది. ఆ వయసులో పిల్లలు మానసికంగా కాస్త బలహీనంగా ఉంటారంటారు మోదీ. అందుకే ఆ వయసు వాళ్లకు సంబంధించిన అంశాలకే తన కొత్త పుస్తకంలో ప్రాధాన్యమిచ్చారు. పరీక్షల ఒత్తిడీ, ఇతర ఆకర్షణలూ, వాటిని జయించే విధానం, మార్కులకూ తెలివితేటలకూ ఉన్న వ్యత్యాసం, భవిష్యత్తుకి సిద్ధమవ్వాల్సిన తీరూ... ఇలా అనేక అంశాలను మోదీ తన పుస్తకంలో స్పృశించారు. సాధారణ వ్యక్తిత్వ వికాస పుస్తకాల్లా కాకుండా విద్యార్థులతో, వాళ్ల తల్లిదండ్రులతో తానే మాట్లాడుతున్నట్లుగా ఉండేలా తన నిజజీవిత అనుభవాలనే పుస్తకంలో ప్రస్తావించారట. 'నా మనసుకు దగ్గరగా ఉన్న అంశాన్నే రచన కోసం ఎంచుకున్నా. దేశ భవిష్యత్తులో యువత పాత్రపైన నాకు కొన్ని అభిప్రాయాలున్నాయి. అవేంటో ఈ పుస్తకం ద్వారా పంచుకోబోతున్నా. ఇది చదివాక యువత నన్నో మంచి స్నేహితుడిలా భావిస్తారు' అని పుస్తకం గురించి ప్రస్తావిస్తూ మోదీ తన మనసులో మాట బయటపెట్టారు.



★ ప్రధానిగా మారాక మోదీకి ఇదే తొలి పుస్తకమైనా, గతంలో డజనుకుపైగా పుస్తకాలను రచించారు. తల్లిప్రేమా, ప్రకృతీ, వాతావరణ మార్పులూ, పేదరికం ఇలా భిన్నమైన అంశాలపైన పుస్తకాలు రాసి వైవిధ్య రచయితగా గుర్తింపు తెచ్చుకున్నారు. కవిత్వంలోనూ ఆయనది అందెవేసిన చేయే. ప్రసంగాల్లో తన కవితలనూ వినిపించే మోదీ, కేవలం కవితలతోనూ పుస్తకాలను తీసుకొచ్చారు.

★ 'సాక్షి భావ్'... తాను రాసిన పుస్తకాల్లో తనకు బాగా దగ్గరైన పుస్తకం ఇదేనంటారు మోదీ. నిజానికి మోదీ వ్యక్తిగత డైరీకి పుస్తక రూపమే 'సాక్షిభావ్'. గతంలో తన ఆలోచనలని కవితల రూపంలో డైరీలో రాసుకొని, ఆర్నెల్ల తరవాత ఆ డైరీని కాల్చేయడం మోదీకి అలవాటుగా ఉండేదిట. కానీ ఆయన దగ్గరి స్నేహితులు కొందరు ఓసారి డైరీని కాల్చొద్దని వారించి, అందులోని కవితలను పుస్తకంగా తీసుకొచ్చారు. అదే 'సాక్షి భావ్. దాన్ని చదివితే తన ఆలోచనలు ఎలా ఉంటాయో అర్థమవుతుందంటారు మోదీ.

★ 'ఆపత్‌కాల్ మే గుజరాత్'... దేశంలో ఎమర్జెన్సీ విధించిన సమయంలో పాతికేళ్ల కుర్రాడిగా తాను అనుభవించిన ఆవేదనను ఈ పుస్తకంలో మోదీ ప్రస్తావించారు. 'జ్యోతి పుంజ్'... కాంతిరేఖలు అన్న అర్థం వచ్చే ఈ పుస్తకంలో తనను బాగా ప్రభావితం చేసిన పదహారు మంది ఆరెస్సెస్ సభ్యుల గురించి తెలిపారు. గుజరాత్ ముఖ్యమంత్రిగా ఉండగా ఆయన రాసిన తొలి పుస్తకమిది. 'కన్వీనియంట్ యాక్షన్- కంటిన్యుటీ ఫర్ చేంజ్'... వాతావరణ మార్పులూ, వాటిని ఎదుర్కోడానికి దేశం చేస్తున్న ప్రయత్నాల గురించి ఆంగ్లంలో రాసిన ఈ పుస్తకాన్ని రెండేళ్ల క్రితం ప్యారిస్‌లో ఆవిష్కరించారు. 'భావ్ యాత్ర'... ప్రకృతీ, భారతీయ సంప్రదాయాల ఔన్నత్యం గురించి కవితల రూపంలో వివరించే పుస్తకమిది. అమ్మ ప్రేమ గురించి తెలియజేస్తూ 'ప్రేమ్ తీర్థ్', దేశభక్తీ, పేదరికం, రైతుల సాదకబాధకాలను ప్రస్తావించే గుజరాతీ పుస్తకం 'ఆంఖ్ ఆ ధన్య చే', చదువుపైన తన అభిప్రాయాల్ని తెలియజేసే 'ది యోగా ఆఫ్ ఎడ్యుకేషన్'... ఇలా రకరకాల అంశాలపైన డజనుకుపైగా పుస్తకాలను రాసిన మోదీ, ప్రధాని అయ్యాక కూడా ఆ వ్యాపకాన్ని వదలకపోవడం విశేషం.

★ స్వతహాగానే మంచి పుస్తక ప్రియుడైన మోదీ, ఆ అలవాటే తనను రచయితగా మార్చిందంటారు. కుర్రాడిగా ఉన్నప్పుడు 'బెంజిమన్ ఫ్రాంక్లిన్' జీవిత చరిత్ర తనని బాగా ప్రభావితం చేసిందంటారు. వివేకానందుడిని ఆరాధించే మోదీ, ఆయన రచనలతో పాటు, అరొబిందో రచనల్నీ, ప్రముఖుల జీవిత చరిత్రల్నీ, ఆధ్యాత్మిక పుస్తకాల్నీ ఎక్కువగా చదువుతారు. ప్రతి సమస్యనీ సానుకూల దృష్టితో చూసే ఓ పిల్లాడి జీవితం గురించి తెలిపే 'పాలీ యానా' అనే ఇంగ్లిష్ నవలని చదవమని విద్యార్థులకు సూచిస్తారు. జీవితంలో ఎలాంటి పరిస్థితులనైనా ఎదుర్కొనే ధైర్యం, తెలివితేటలూ పుస్తకాల ద్వారానే అబ్బుతాయని తాను నమ్ముతానంటారు. ఆ ధైర్యాన్ని విద్యార్థులకు పంచేందుకే తన కొత్త పుస్తకాన్ని తీసుకొస్తున్నట్లు ఆయన చెబుతారు. గతేడాది 'మన్ కీ బాత్' కార్యక్రమంలో భాగంగా విద్యార్థులతో మాట్లాడినప్పుడే ఈ పుస్తకానికి సంబంధించిన ఆలోచన వచ్చిందంటారు మోదీ. అచ్చవనున్న కాపీల సంఖ్య ద్వారా విడుదలకు ముందే కొత్త రికార్డుకి శ్రీకారం చుట్టిన మోదీ పుస్తకం, మార్కెట్లోకి వచ్చాక ఇంకెన్ని సంచలనాలకు తెరతీస్తుందో చూడాలి..! ★

# మ్యాచ్ ఆడి వచ్చేసరికి... అమ్మ లేదు!

**అతడు ప్రకటనల్లో కనిపించడు, వివాదాల్లో వినిపించడు, ఐపీఎల్‌లో ఆడడు... భారతజట్టు టెస్టు క్రికెట్ ఆడినపుడు మాత్రం క్రీజులో పాతుకుపోతాడు, బ్యాట్ ఝుళిపిస్తాడు, పరుగుల వరద పారిస్తాడు... ఆ క్రికెటర్ మరెవరో కాదు చెతేశ్వర్ పుజారా. ఇటీవల 50 టెస్టుల మార్కుని దాటిన చెతేశ్వర్ భారత టెస్టు క్రికెట్‌లో ఓ కొత్త అధ్యాయం!**



చెతేశ్వర్‌కి మూడేళ్లపుడు అతడి బాబాయి ప్లాస్టిక్ బ్యాట్ కొనిచ్చాడు. దాన్ని పట్టుకొని స్థానిక పార్కులో ఫొటోకి స్టిల్స్ ఇచ్చాడు చెతేశ్వర్. తర్వాత ఆ ఫొటోల్ని చూసిన తండ్రి అరవింద్... చెతేశ్వర్ కాళ్ల మునివేళ్లమీద నిలబడి ఆడుతున్నట్టు గమనించాడు. చెతేశ్వర్‌లో ఓ క్రికెటర్ ఉన్నాడన్న విషయాన్ని అలా తొలిసారి గుర్తించిన అరవింద్... రోజూ చిన్నారి చెతేశ్వర్ చేతికి బ్యాట్ ఇస్తూ తానే బంతులు విసిరేవాడు. చెతేశ్వర్ ఎంతో సులభంగా బంతుల్ని కొడుతుంటే నిజంగానే అతడికి క్రికెట్‌లో భవిష్యత్తు ఉంటుందనిపించింది అరవింద్‌కి. ఒక నిర్ణయానికి వచ్చే ముందు స్నేహితుడు, భారత మాజీ ఆటగాడు, బీపీసీఎల్ కోచ్ అయిన కర్సన్ ఘావ్రీకి చెతేశ్వర్ ఆట చూపాలనుకున్నాడు. కర్సన్‌కు చెబితే చెతేశ్వర్‌ని తీసుకొని ముంబయి రమ్మన్నారు. దాంతో గుజరాత్‌లోని రాజ్‌కోట్ నుంచి ముంబయి వచ్చారు అరవింద్. 'పిల్లాడిలో సహజమైన ప్రతిభ ఉంది' చెతేశ్వర్‌ని చూశాక కర్సన్ అన్నమాటలివి. ఆయన కూడా అదే మాట చెప్పడంతో చెతేశ్వర్‌ని క్రికెటర్‌గా తీర్చిదిద్దాలనుకున్నారు అరవింద్. ఏడేళ్లకే చెతేశ్వర్‌కి లెదర్ బంతిని అలవాటు చేయించారు. ఒకసారి లెదర్‌బాల్‌తో ఆడటం ప్రారంభించాక రబ్బరు, టెన్నిస్ బంతులతో ఆడొద్దనీ, అలా అయితే ఎప్పటికీ క్రికెట్ నేర్చుకోలేవనీ చెతేశ్వర్‌కి చెప్పారు. 'నాకు రబ్బరు, టెన్నిస్ బంతులతో ఆడాలని ఉండేది. నాన్న మాత్రం వాటితో అస్సలు ఆడొద్దన్నారు. వేర్వేరు బంతులతో కొట్టాల్సిన షాట్లు వేర్వేరుగా ఉంటాయని చెప్పి మాన్పించారు' అంటాడు పుజారా.

## నాన్నే కోచ్

అరవింద్ వికెట్ కీపర్‌గా, బ్యాట్స్‌మన్‌గా ఫస్ట్‌క్లాస్ మ్యాచ్‌లు ఆడారు. స్థానికంగా ఉండే వెల్జీ మాస్టర్ దగ్గర పాఠాలు నేర్చుకున్నారు అరవింద్. తర్వాత ఆయన దగ్గర అసిస్టెంట్ కోచ్‌గా పనిచేశారు. ఆపైన రైల్వేలో ఉద్యోగం రావడంతో క్రికెట్‌కు దూరంగా ఉన్నారు. ఒకనాటి తన అనుభవంతో చెతేశ్వర్‌కి బ్యాటింగ్‌లో ఓనమాలు నేర్పించేవారు. తానే కొడుక్కి బౌలింగ్ చేసేవారు. వారుండే రైల్వే కాలనీ మైదానంలో సిమెంట్ పిచ్ తయారుచేయించి, అక్కడి పిల్లలకూ ఉచిత శిక్షణ ఇచ్చేవారు. చెతేశ్వర్ ప్రాక్టీసుకి ఆదివారం, పండగరోజుల్లాంటి సెలవులేవీ ఉండేవి కాదు. రోజూ అయిదింటికే నిద్రలేచి అరగంటలో ప్రాక్టీసుకి సిద్ధమయ్యేవాడు. తొమ్మిది గంటలకు తిరిగి ఇంటికి వచ్చి హోమ్ వర్కులు చేసేవాడు. మధ్యాహ్నం పన్నెండున్నర నుంచి సాయంత్రం అయిదింటివరకూ స్కూల్. స్కూల్ నుంచి వచ్చాక చీకటి పడేంత వరకూ ప్రాక్టీసు చేసేవాడు. పుజారాని క్రికెట్ తప్ప మిగతా ఆటలవైపు పోనిచ్చేవారు కాదు అరవింద్. 'తొలిరోజుల్లో చాలా స్ట్రిక్ట్‌గా ఉండేవారు నాన్న. దీపావళికి మతాబులు కాల్చనిచ్చేవారు కాదు. సంక్రాంతికి గాలి పటాలు ఎగరేయనిచ్చేవారు కాదు. నాకు చిన్న గాయమైనా ప్రాక్టీసు ఆగుతుందనేది ఆయన భయం. అవన్నీ ఆటమీద నా ఏకాగ్రత పెరిగేలా చేశాయి' అంటాడు పుజారా.

## వేసవిలో ముంబయికి...

చెతేశ్వర్‌చేత అరవింద్ రోజూ ప్రాక్టీసు చేయిస్తూనే ఉన్నారు. ఆట పరంగా ఎన్నో మెలకువలు నేర్చుకున్నాడు చెతేశ్వర్. కానీ ప్రాక్టీసు వేరు, మ్యాచ్‌లు ఆడటం వేరు. చెతేశ్వర్ అంతర్జాతీయస్థాయికి వెళ్లాలంటే మ్యాచ్‌లు ఆడాల్సిందేనని అరవింద్‌కి తెలుసు. కానీ రాజ్‌కోట్‌లో ఆ వాతావరణం లేదు. అందుకని చెతేశ్వర్‌కి పదేళ్లు వచ్చినప్పట్నుంచీ ఏటా వేసవి సెలవుల్లో ముంబయిలో ఉంటూ మ్యాచ్‌లు ఆడించేవారు. ముంబయిలో ఇంటిని అద్దెకు తీసుకొని ఉండేంత ఆర్థిక స్తోమత ఆ కుటుంబానికి లేదు. దాంతో అక్కడ ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్‌లో పనిచేస్తున్న ఓ పరిచయస్తుడి ద్వారా ఆ కంపెనీ క్వార్టర్స్‌లో ఖాళీగా ఉండే, నిర్మాణం పూర్తికావస్తున్న ఫ్లాట్‌లలో ఉండేవారు. అలా ఏడాదిలో రెండు మూడు నెలలు పుజారా కుటుంబం ముంబయిలో ఉండేది. కర్సన్ తోడ్పాటుతో స్థానికంగా ఉండే ఓ వేసవి శిక్షణ శిబిరంలో చెతేశ్వర్‌కి చోటు దొరికింది. ఆ క్యాంప్ నిర్వాహకుడి సహాయంతో ఏ జట్టులోనైనా ఖాళీ ఉంటే తెలుసుకునేవారు అరవింద్. ఆడ్డానికి అవకాశం ఉందంటే ఎంత దూరమన్నది ఆలోచించకుండా తండ్రీకొడుకులు క్రికెట్ కిట్ పట్టుకొని లోకల్ ట్రెయిన్లో వెళ్లి ఆ జట్టు మైదానంలో వాలిపోయేవారు. ఇంటి దగ్గర చెతేశ్వర్ తల్లి రీనా, మైదానంలో చెతేశ్వర్, మైదానం వెలుపల అరవింద్... ఆ మూడు నెలలూ వారి పరిస్థితి ఇలానే ఉండేది. అలా వేసవిలో వేర్వేరు పిచ్‌లపైన 20 మ్యాచ్‌ల వరకూ ఆడే అవకాశం వచ్చేది. మూడేళ్లపాటు అలాగే ముంబయి వెళ్లేది పుజారా కుటుంబం. ఒక్క మ్యాచ్‌లో సరిగ్గా ఆడకపోయినా తర్వాత మ్యాచ్‌లో అవకాశం వస్తుందో రాదో తెలీదు, అందుకని ఎట్టి పరిస్థితుల్లోనూ వికెట్ ఇచ్చేవాడు కాదు చెతేశ్వర్. అదే తర్వాత కూడా అలవాటైంది.

## అమ్మ కోరిక తీరింది!

సౌరాష్ట్ర అండర్-14 రాష్ట్ర జట్టుకి ఎంపికకావడంతో 13 ఏళ్లపుడు చెతేశ్వర్ మ్యాచ్ ఆడేందుకు పుణె వెళ్లాల్సి వచ్చింది. మొదటిసారి అమ్మానాన్నల్ని విడిచి వెళ్లాల్సిన పరిస్థితి వచ్చేసరికి చెతేశ్వర్ కంట తడి

## ఇంకొంత

**యా**భై టెస్టులాడిన చెతేశ్వర్ నాలుగు వేలకుపైగా పరుగులు చేశాడు. అందులో 13 సెంచరీలు (వాటిలో రెండు డబుల్ సెంచరీలు) ఉన్నాయి.

★ గతేడాది సొంతూరు రాజ్‌కోట్‌లో టెస్టు మ్యాచ్ ఆడినపుడే మొదటిసారి అంతర్జాతీయ మ్యాచ్‌లో చెతేశ్వర్‌ని మైదానంలో ఉండగా చూశారు అరవింద్. ఆ మ్యాచ్‌లో పుజారా సెంచరీ చేశాడు.

★ మూడేళ్ల చెతేశ్వర్ బ్యాట్‌తో కొడుతున్న స్టిల్‌నీ, ఓ టెస్టు మ్యాచ్‌లో అదే తరహా షాట్ ఆడుతున్న స్టిల్‌నీ ఫ్రేమ్ కట్టించి ఇచ్చాడో అభిమాని. అది వాళ్లింట్లో ఉంటుంది.

★ రాజ్‌కోట్‌కే చెందిన పూజాను పెళ్లి చేసుకున్నాడు.

★ రాజ్‌కోట్‌లో క్రికెట్ అకాడమీని ప్రారంభించి ఉచిత శిక్షణ ఇస్తున్నాడు.

★ ప్రస్తుతం ఇంగ్లిష్ కౌంటీల్లో ఆడుతున్న ఏకైక భారతీయ క్రికెటర్.

★ అయిదు వన్డేలు మాత్రమే ఆడాడు.



తండ్రి అరవింద్‌తో...

పెట్టాడట. కానీ ఆ సీజన్లో ట్రిపుల్ సెంచరీ చేశాడు. తర్వాత రాష్ట్ర అండర్-16, 17 ఏళ్లకే అండర్-19 జట్టులకీ ఎంపికయ్యాడు. ప్రతి చోటా భారీస్కోర్లు నమోదుచేశాడు. ఆ దశలోనే ఆస్ట్రేలియాలో శిక్షణ ఇచ్చే బోర్డర్-గవాస్కర్ స్కాలర్‌షిప్‌కి ఎంపికయ్యాడు. చెతేశ్వర్‌కి అప్పటికి 18 ఏళ్లు నిండలేదు. ఆస్ట్రేలియా బోర్డు మాత్రం 18 ఏళ్లు నిండని వాళ్లకి సంరక్షకుడు ఉండాలని నియమం పెట్టింది. కానీ చెతేశ్వర్‌తో మరొకరిని పంపించడానికి అయ్యే ఖర్చుని భరించడానికి సౌరాష్ట్ర క్రికెట్ సంఘం, జాతీయ క్రికెట్ అకాడమీలు భరించడానికి ముందుకు రాలేదు. అరవింద్‌కూ ఆ శక్తి లేకపోయింది. దాంతో చెతేశ్వర్ ఆస్ట్రేలియా వెళ్లలేకపోయాడు. అందుకు చాలా బాధపడ్డాడు. మెరుగైన అవకాశాల కోసం చెతేశ్వర్‌ని జాతీయ క్రికెట్ అకాడమీ ఉన్న బెంగళూరులో ఉంచాలనుకున్నాడు అరవింద్. కానీ భార్య రీనా మాత్రం 'మీరు మరీ ఎక్కువగా ఆలోచిస్తున్నారు. వాడు ఇక్కడ ఉన్నా ఇండియాకి ఆడతాడు. ఆందోళన పడకండి' అంటూ భరోసా ఇచ్చేది. 2005లో భావ్‌నగర్‌లో ఓ మ్యాచ్ ఆడి తిరిగి వస్తున్నాడు చెతేశ్వర్. తండ్రిని బస్‌స్టాప్‌కి పంపమని అమ్మకి ఫోన్ చేశాడు. ఆమె సరేనంది. తండ్రితోపాటు ఇంటికి వచ్చేసరికి మాత్రం ఆమె బతికిలేదు. రీనాను రొమ్ము క్యాన్సర్ బలితీసుకుంది. నాల్రోజులపాటు ఆ షాక్‌లో ఉండిపోయాడు చెతేశ్వర్. అయిదో రోజున ముంబయితో అండర్-19 మ్యాచ్‌కు వెళ్లాల్సి ఉంటే, తనవల్ల కాదన్నాడు. 'అమ్మ ఉంటే నిన్ను ఆడమనేది' అరవింద్ నోట వచ్చిన ఆ మాటలతో మ్యాచ్‌కు బయలుదేరాడు చెతేశ్వర్. కానీ ఏకాగ్రత కుదరక పరుగులు చేయలేకపోయాడు. చెతేశ్వర్ పరిస్థితిని గమనించి వారి కుటుంబ గురూజీ దగ్గరకు తీసుకు వెళ్లారు అరవింద్. 'అమ్మ నిన్ను భారత జట్టులో చూడాలనుకుంది. ఆమె కోర్కెని నిజం చేయాల్సిన బాధ్యత నీదే' అన్నారా గురూజీ. ఆరోజు నుంచి దిగులు చెందడం మానేసి మళ్లీ పరుగుల వేట మొదలుపెట్టాడు చెతేశ్వర్. తల్లి రీనా చిన్నారి చెతేశ్వర్‌కి ప్యాడ్‌లు కుట్టేది. పూజ, ధ్యానం అలవాటు చేసింది. రోజూ 10-15 నిమిషాలు ధ్యానం చేయడం ఇప్పటికీ మానడు. వాళ్లది శాకాహార కుటుంబం. కొడుకు రోజంతా నిలబడి ఆడాలంటే బలం కావాలి. దానికోసం డ్రైఫ్రూట్స్‌తో చేసిన పదార్థాల్ని ప్రసాదంగా పెట్టేవారు రీనా. 'అమ్మ ఎదుట లేకపోయినా నా ప్రతి కదలికలో ఆమె ఉంది' అంటాడు చెతేశ్వర్. 2006 అండర్-19 ప్రపంచకప్‌లో అత్యధిక పరుగులు(349) చేసిన బ్యాట్స్‌మన్‌గా గుర్తింపు సాధించిన చెతేశ్వర్, 2008లో సౌరాష్ట్ర తరపున ఆడుతూ దేశవాళీ మ్యాచ్‌లలో మూడు ట్రిపుల్ సెంచరీలు చేశాడు. 2010లో పుజారాల కల నిజమైంది. ఆ ఏడాది భారత టెస్టు జట్టులోకి చెతేశ్వర్ ఎంపికయ్యాడు. ఆస్ట్రేలియాతో స్వదేశంలో జరిగిన ఆ మ్యాచ్‌లో లక్ష్య ఛేదనలో చెతేశ్వర్ 72 పరుగులు చేసి కీలక ఇన్నింగ్స్ ఆడి భారత్‌ని గెలిపించాడు. గాయం కారణంగా 2011 మొత్తం క్రికెట్‌కు దూరంగా ఉండాల్సి వచ్చినా, 2012లో మళ్లీ టెస్టుజట్టులోకి వచ్చాడు. అప్పట్నుంచీ మూడో స్థానంలో ఆడుతూ ద్రవిడ్‌ను గుర్తుచేస్తున్నాడు.



### అమ్మానాన్నా... ఆయనే!

'నేను ఇంతటివాణ్ని అయ్యానంటే కారణం నాన్ననే చెప్పాలి. తండ్రిగానే కాకుండా కోచ్‌గానూ నా కెరీర్‌ను తీర్చిదిద్దారు. అమ్మ చనిపోయాక నా బాగోగుల్ని ఆయనే చూసుకున్నారు. అప్పట్నుంచీ ఇద్దరికీ క్రికెట్టే ప్రపంచమయింది. నన్ను క్రికెట్ నుంచి దృష్టి మరల్చనీయలేదు. ఆయన ఆలోచనలూ ఆటచుట్టూనే ఉండేవి' అంటాడు చెతేశ్వర్. 'ఏ విద్య అయినా నేర్చుకునేటపుడు గురువు పైన పూర్తిగా నమ్మకం కుదరాలి. చెతేశ్వర్ నన్ను పూర్తిగా నమ్మాడు. ఆటలో ఎలాంటి సమస్య ఉన్నా నాతో చర్చించేవాడు. ఇతరులు ఏదైనా సలహా ఇచ్చినా నాతో చెప్పి అభిప్రాయం అడిగేవాడు. ఎంతో క్రమశిక్షణతో ఉంటాడు. దానివల్ల ఏకాగ్రత పెరిగింది' అంటారు అరవింద్. సాధారణంగా తండ్రీ కొడుకుల మధ్య కుటుంబ వ్యవహారాలూ, ఆర్థిక వ్యవహారాలూ చర్చకు వస్తాయి. కానీ ఇప్పటికీ అరవింద్, చెతేశ్వర్‌ల మధ్య క్రికెట్ అంశాలే ప్రధానంగా చర్చకు వస్తాయి. ఇప్పటికీ రోజూ ఆట ముగిశాక పిచ్ స్వభావం, బంతి స్వింగ్, బౌన్స్ కావడం, చెతేశ్వర్ ఆడిన తీరు... మొదలైన అంశాల్ని ఫోన్లో చర్చిస్తుంటారు తండ్రీకొడుకులు. 'ఇదంతా ఆట మెరుగుపర్చుకోవడం కోసమే'నంటారు అరవింద్.

### జెంటిల్మన్...

రెండేళ్ల కిందట శ్రీలంకతో జరిగిన మూడు మ్యాచ్‌ల టెస్టు సిరీస్‌లో తొలి మ్యాచ్‌లో చెతేశ్వర్ రాణించలేదు. దాంతో రెండో మ్యాచ్‌లో అతడికి విశ్రాంతి ఇచ్చారు. మూడో మ్యాచ్‌లో మరో బ్యాట్స్‌మన్‌కి గాయమైతే ఓపెనర్‌గా వచ్చాడు చెతేశ్వర్. తోటి బ్యాట్స్‌మెన్‌లలో కె.ఎల్.రాహుల్(2), రహానె(8), కోహ్లి(18), రోహిత్ శర్మ(26) తక్కువ పరుగులకే చేతులెత్తేస్తే, పుజారా ఒక్కడే 145 పరుగులు చేశాడు. ఆ మ్యాచ్ గెలిచి మన జట్టు సిరీస్‌నీ దక్కించుకుంది. అప్పట్నుంచీ భారత్ తరపున చెతేశ్వర్ ఆడని టెస్టు లేదని చెప్పాలి. ఈ రెండేళ్లలో పుజారా 23 టెస్టులాడి రెండువేలకు పైగా పరుగులు సాధించాడు. అందులో ఏడు శతకాలున్నాయి. భారత జట్టులో ప్రస్తుతం ఏ ఆటగాడికీ ఇంత గొప్ప గణాంకాలు లేవు. ఈ పరుగుల్లో కొన్ని టీమ్ విజయానికి దోహదపడగా, ఇంకొన్ని జట్టుని ఓటమి నుంచి గట్టెక్కించాయి. టెస్టుల్లో తిరుగులేకపోయినా, ఇతర ఫార్మాట్‌లలో మాత్రం చెతేశ్వర్ ఉనికి తక్కువ. కారణం అతడి ఆటలో మెరుపులు ఉండవు కానీ, నిలకడ ఉంటుంది. భారీ షాట్లు ఉండవు కానీ, భారీ ఇన్నింగ్స్ ఉంటాయి. వినోదం కాకుండా క్రికెట్ మాత్రమే కనిపిస్తుంది! ఎందుకంటే, జెంటిల్మన్ గేమ్‌ని అదే తరహాలో ఆడతాడీ జెంటిల్మన్! ★



న్యాయాన్ని కాపాడటం, అన్యాయాన్ని రూపుమాపడం, శాంతి భద్రతల్ని నెలకొల్పడం... ఎక్కడైనా పోలీసుల విధులివే. కానీ ఆ పోలీసులు వీటితోపాటు పేద పిల్లల చదువు బాధ్యతనూ తీసుకున్నారు. పోలీసు కార్యాలయం ఆవరణలోనే పాఠశాలను నడుపుతూ వందల మందికి నాణ్యమైన చదువు చెప్పించి జీవితాన్నిస్తున్నారు. అదే ఖమ్మం జిల్లా పోలీసు అధికారుల ప్రత్యేకత.

# పేద పిల్లలకు పోలీసు బడి..!



సంవత్సరం... 1995. ఖమ్మం జిల్లా పోలీసు ఉన్నతాధికారి పాత కార్యాలయ భవనం ఖాళీగా ఉంది. దాన్నేం చెయ్యాలీ అనుకుంటున్న సమయంలో అప్పటి ఎస్పీ ఉమాపతికి గతంలో తను పనిచేసిన విజయనగరంలో పోలీసు బెటాలియనే ఓ పాఠశాలను నిర్వహిస్తున్న విషయం గుర్తుకొచ్చింది. ఆ తరహాలోనే ఖమ్మంలోనూ పోలీసుల ఆధ్వర్యంలో క్రమశిక్షణతో చదువు చెప్పే ఓ మంచి పాఠశాల నడిపితే చుట్టుపక్కల పేద పిల్లలతో పాటు డిపార్ట్‌మెంట్‌లో పనిచేసే కిందిస్థాయి ఉద్యోగుల పిల్లలకూ నాణ్యమైన విద్యనందించొచ్చు... అనుకున్నారు. అదే విషయాన్ని అక్కడ పనిచేసే మిగిలిన సిబ్బందితోనూ చర్చించారు. అందరూ తమవంతు సహకారాన్ని అందించడానికి ముందుకురావడంతో పై అధికారుల అనుమతి తీసుకున్నారు. అలా ఆ ఏడాదే ఖాళీగా ఉన్న పాత కార్యాలయంలో డెబ్భైఅయిదు మంది విద్యార్థులతో 'కృష్ణప్రసాద్ మెమోరియల్' పాఠశాల ఊపిరిపోసుకుంది. గతంలో ఖమ్మంలో పనిచేసి 1992లో హైదరాబాద్‌లో ఉగ్రవాదుల కాల్పుల్లో మరణించిన కృష్ణప్రసాద్ ఐపీఎస్ గౌరవార్థం బడికి ఆ పేరు పెట్టారు. జిల్లా సాయుధ దళం ఆధ్వర్యంలో ప్రారంభమైన దీన్లో మొదట్లో ఒకటి నుంచి నాలుగో తరగతి వరకూ బోధించేవారు. ఉమాపతి తర్వాత జిల్లాకు ఎస్పీగా వచ్చిన ప్రతి అధికారీ ఈ విద్యాలయం అభివృద్ధికి తమవంతు కృషి చేశారు. గణతంత్ర, స్వాతంత్ర్య దినోత్సవాల సందర్భంగా పోలీసు పరేడ్ మైదానానికి వచ్చే జిల్లా కలెక్టర్లనూ ప్రజాప్రతినిధుల్నీ పాఠశాల అభివృద్ధికి సాయం చేయాలని కోరేవారు. వారు స్పందించి మంజూరు చేసిన ప్రభుత్వ నిధులూ చేసిన ఆర్థికసాయంతో కొద్దికాలంలోనే అత్యాధునిక వసతులతో మరో భవనం రూపుదిద్దుకుంది. నిజానికి ఈ భవనంలో ఆరుగదుల్ని నిర్మించేందుకే మొదట నిధులున్నాయి. కానీ పోలీసు శాఖలో పనిచేసే మేస్త్రీలూ కార్పెంటర్లూ ఎలక్ట్రీషియన్లూ తమవంతు సాయంగా ఎవరు చేయగలిగిన పనిని వారు ఉచితంగా చేసిపెట్టడంతో డబ్బు మిగిలి, పది గదుల భవనాన్ని కట్టగలిగారు. అలా ఎందరో మంచి మనుషుల సహకారంతో పాఠశాలను అంచెలంచెలుగా పదోతరగతి వరకూ పొడిగించడంతో పాటు, ఆంగ్ల మాధ్యమాన్నీ ప్రవేశపెట్టారు. ప్రస్తుతం 678 మంది విద్యార్థులున్న ఈ పాఠశాలలో ప్రభుత్వ సహకారంతో పుస్తకాలనూ ఉచితంగా పంపిణీ చేస్తున్నారు.

## ఫీజులు ఉండవు

వేర్వేరు తరగతుల విద్యార్థులకు పాఠాలను బోధించేందుకు నైపుణ్యంగల 29 మంది ఉపాధ్యాయుల బృందం పనిచేస్తోందిక్కడ. పోలీసు శాఖలో బీఈడీ లేదా ఇతర ఉన్నత విద్యల్ని చదివిన హోంగార్డులు కొందరితో పాటు ప్రైవేటుగానూ టీచర్లను ఎంపిక చేస్తుంది పాఠశాల నిర్వహణ కమిటీ. ఈ ఉపాధ్యాయులకు స్వచ్ఛంద సంస్థల ఆధ్వర్యంలో ఆంగ్ల మాధ్యమంలో బోధన గురించి ప్రత్యేకంగా శిక్షణ ఇప్పిస్తారు. పాఠశాల నిబంధనల విషయానికొస్తే ఎవరైనా ఇక్కడ చదవొచ్చు. ఈ ఏడాది 67మంది సొంత శాఖ ఉద్యోగుల పిల్లలుండగా మిగిలిన వారంతా చుట్టుపక్కల ప్రాంతాలూ గ్రామాల పిల్లలే. ఫీజులు కట్టాలనే నిర్బంధం కూడా ఉండదు. 'మీకివ్వాలనిపిస్తే ఎంతో కొంత ఇవ్వండి' అంటారు నిర్వాహకులు. ఇక్కడ చదివేవాళ్లు చాలామంది పేద విద్యార్థులే. దాంతో కొద్దిమంది మాత్రం ఏడాదికి ఎంతో కొంత ఇస్తుంటారు. వీటితో పాటు స్వచ్ఛంద సంస్థలూ పోలీసు ఉన్నతాధికారులూ ఇచ్చే విరాళాలను ప్రైవేటు ఉపాధ్యాయులకూ పాఠశాలలో పనిచేసే ఇతర సిబ్బంది జీతాలకోసమూ ఉపయోగిస్తారు. హోంగార్డు కేడర్‌లో ఉన్న ఉపాధ్యాయులకు ప్రభుత్వమే జీతాల్ని ఇస్తుంది. పాఠశాల నిర్వహణకు అవసరమైతే పోలీసు సంక్షేమ నిధి డబ్బునీ వాడుతుంది కమిటీ. ఈమధ్యే లయన్స్ క్లబ్, రోటరీ క్లబ్‌లు 100 బల్లలనూ ప్రవాస భారతీయుల ఫౌండేషన్ డిజిటల్ పాఠాల బోధనలకు రెండు టీవీలనూ అందజేశాయి.

## కార్పొరేటుకి దీటుగా

ప్రస్తుతం రాష్ట్ర సిలబస్‌తో నడుస్తున్న ఈ పాఠశాలలో వచ్చే ఏడాది నుంచీ సీబీఎస్ఈ సిలబస్‌ను ప్రవేశపెట్టనున్నారు. ఈ ఏడాదే తొమ్మిదో తరగతి విద్యార్థులకు ఐఐటీ ఫౌండేషన్ కోర్సును కూడా ప్రారంభించారు. త్వరలోనే డిజిటల్ తరగతుల్నీ ఏర్పాటు చేసే పనిలో ఉన్నారు. పోలీసు శాఖ గ్రంథాలయంలోనే ఓ పక్కన విద్యార్థులకు అవసరమైన రకరకాల పుస్తకాలతో చిన్న గ్రంథాలయం ఉంటుంది. ఇలా ఇక్కడ పిల్లలకు కార్పొరేట్ పాఠశాలలకు దీటుగా అన్ని సౌకర్యాలూ అందుబాటులో ఉంటాయి. 2003 నుంచీ కృష్ణప్రసాద్ మెమోరియల్ పాఠశాల ఎప్పుడూ వందశాతం ఉత్తీర్ణతను సాధిస్తోందంటేనే ఈ పాఠశాల పనితీరు ఎలా ఉందో చెప్పొచ్చు. ఇక్కడ చదివిన ఎంతోమంది ప్రభుత్వ ప్రైవేటు ఉద్యోగాల్లో ఉన్నత స్థానాల్లో ఉన్నారు. ప్రస్తుత పోలీస్ కమిషనర్ తఫ్సీర్ ఇక్బాల్‌తో పాటు ఆయన భార్య జెబా ఖానమ్ సారథ్యంలోని పాఠశాల నిర్వహణ కమిటీ వందశాతం తరగతుల డిజిటలైజేషన్, సీబీఎస్ఈ సిలబస్ బోధన, స్పోకెన్ ఇంగ్లిష్ తరగతుల నిర్వహణకు కృషిచేస్తోంది అంటారు ప్రధానోపాధ్యాయుడు శేషగిరిరావు.

వందలమంది పేద పిల్లలకు విద్యాదానం చేస్తోన్న ఖమ్మం పోలీసులకు హ్యాట్సాఫ్ చెప్పాల్సిందే.

– గోపయ్య మాడుగుల, ఈనాడు, ఖమ్మం డెస్కు

ఫొటోలు: ఆళ్ల శేషవర్ధన్‌రెడ్డి



# మీ చిన్నారి నిద్ర ఎంతో ముఖ్యమైనది



చిన్నారి పెరుగుదల మరియు అభివృద్ధి కొరకు శుభరాత్రి నిద్ర అనేది చాలా ముఖ్యం. మెరుగైన నిద్ర సంతోషకరమైన మరియు ఉత్సాహకర మైన ప్రవర్తనను కలుగజేస్తుంది. మీ చిన్నారి యొక్క మెరుగైన శారీ రక పనితీరుకు మరియు మానసికాభివృద్ధికి కూడా ఇది దోహదపడు తుంది. మీ చిన్నారికి రాత్రివేళల్లో ఆటంకంలేని నిద్ర ఉన్నచో, మెరుగ్గా నేర్చుకోవడం మరియు పెరగడం జరుగుతుంది. మీ చిన్నారి ఇతరు లతో చక్కగా మెలగగలుగుతారు మరియు అందరితో మరింత కలివి డిగా ఉండగలుగుతారు, ఎందుకంటే, చిన్నారి చాలా తక్కువ మారాం చేస్తారు. తల్లిదండ్రులు-పిల్లల సాంగత్యం మెరుగైన, నాణ్యమైన రాత్రి పూట నిద్రతో ఇనుమడిస్తుంది. దృఢమైన రోగనిరోధక వ్యవస్థను కలు గజేయటానికి ప్రతి రాత్రి చిన్నారికి సిఫార్స్ చేయబడిన నిద్రా సమ యాన్ని అందించాలి. పెద్దల కన్నా చిన్నారులు ఎక్కువ నిద్రపోతారు మరియు వారి పెరుగదలలో సింహభాగము వారు నిద్రలో ఉండగానే సంభవిస్తుంది.

## ప్రతి రోజు మీ చిన్నారి ఎంత సమయం నిద్రపోవాలి?

| | |
|---|---|
| 0-3 వారాలు | 15-18 గం.లు. |
| 1.5 నెలలు | 14-16 గం.లు. |
| 4 నెలలు | 9-12 గం.లు. |
| 6 నెలలు | 10-12 గం.లు. |
| 6-12 నెలలు | 12-13 గం.లు. |

## రాత్రివేళ నిద్రాభంగానికి కారణాలు

చిన్నారి యొక్క కలత నిద్రకుగల ప్రధాన కారణం చిన్నా రికి అసౌకర్యం కలుగజేసే చిన్నారిచే ప్రక్కతడపడానికి ఆపాదించవచ్చు. ఇది నిమ్మును కలుగజేసే మీ చిన్నారి యొక్క ఛాతీకి నిమ్మును వ్యాపింపజేయడం కూడా సంభవింపజేయవచ్చును. తరచూ న్యాపీలు మార్చడం వలన కూడా చిన్నారికి పలుమార్లు నిద్రాభంగం కలుగ వచ్చును. చిన్నారికి ఆకలి సరిగ్గా తీరనప్పుడు, ఒకవిధ మైన నొప్పివలన, శబ్దం వలన లేదా బాహ్య వేడి వాతావ రణం వలన అసౌకర్యం కలిగినప్పుడు కూడా చిన్నారి నిద్రకు ఆటంకం కలుగవచ్చును.

## పాంపర్స్ ప్యాంట్లు మీ చిన్నారి ఎక్కువ సేపు హాయిగా నిద్రించుటకు ఎలా సహాయపడగలవు?

తడిని పీల్చే పారవేయదగిన డయాపర్ల కన్నా క్లాత్ న్యాపీలు తడిని తక్కువగా పీల్చుతాయి. చిన్నారి చిన్నగా ఉన్నప్పుడు, కొద్ది సమయం వరకైనా తడిని గమనించ కపోయిన పక్షంలో తడి త్వరగా వ్యాపిస్తుంది. తరచూ రాత్రివేళ డయాపర్లను మార్చడానికి ఓపిక ఉండదు మరియు నియంత్రిచడమూ కష్టమే. క్లాత్ న్యాపీని మార్చే సమయంలో ఇది చిన్నారికి నిద్రా భంగంకల్గించి నట్లూ అవుతుంది. సాధారణంగా రాత్రివేళ కనీసం 3 నుంచి 4 సార్లు న్యాపీని మార్చవల్సి ఉంటుంది. 89% సందర్భాలలో ఇలా చేస్తున్నప్పుడు చిన్నారి మేల్కొంటాడు.

ఒక్క పాంపర్స్ ప్యాంట్ మీ చిన్నారిని రాత్రంతా పొడిగా ఉంచగలదు. తద్వారా చిన్నారి రాత్రంతా హాయిగా నిద్ర పోగలడు.

అంతేగాక చిన్నారిని నిద్రపుచ్చడానికి సరియైన వాతావర ణాన్ని కల్పించండి, అనగా అతనికి సరిగా తినిపించడం, దోమల తెర క్రింద ఉంచడం, ధ్వని కాలుష్యం లేకుండా, చూడటం, మరియు నిద్రపుచ్చేందుకు ముందుగా వెచ్చటి నీటి స్నానం చేయించేలా చూసుకోవాలి.

ఇక మీదట మీ చిన్నారి రాత్రివేళ హాయిగా నిదురిం చేలా చూసుకోండి. ఆనందంగా మరియు ఆరోగ్యంగా ఉన్న చిన్నారితో కూడియున్నదే సంతోషకరమైన మరియు ఆరోగ్యకరమైన కుటుంబం.

# గుండెల నిండా... జాతీయ జెండా..!


శివుడి నందీశ్వర కేతనం


విష్ణుమూర్తి గరుడ ధ్వజం


ద్రోణాచార్య జయకేతనం


దుర్యోధనుడి సర్పధ్వజం


ఇంద్రుడి వజ్రాయుధ పతాక


గంగపుత్రుడి తాళ ధ్వజం


అర్జున విజయ గీతిక


లంకాధీశుడి కపాల పతాక

**ఎవరెస్ట్ శిఖరం ఎక్కాడు. చంద్రమండలంమీద అడుగుపెట్టాడు. అంటార్కిటికా ఖండంలో విహరించాడు. ఆర్కిటిక్‌కీ వెళ్లాడు. ఇలా మనిషి ఎక్కడికి వెళ్లినా ముందు చేసే పని జెండాని ఎగరేయడమే. ఎందుకంటే అది అతని స్వేచ్ఛనీ, అస్తిత్వాన్నీ, జాతినీ, దేశ ప్రతిష్ఠనీ చాటే స్వాభిమాన గీతిక... అదే జాతీయ పతాక. స్వతంత్ర భారతావని 70వ పుట్టినరోజు వేడుకలకు సమాయత్తం అవుతున్న సందర్భంగా మనదైన ఆ ముువ్వన్నెల సోయగం ఆవిర్భావం వెనకున్న విశేషాల్లోకి ఓసారి తొంగిచూస్తే...**


మరాఠాల శౌర్య ప్రతీక
ఝాన్సీలక్ష్మీబాయి హనుమ ముద్ర
రాణాప్రతాప్ సూర్య తేజం
మొఘలాయీల సింహనాదం


సిపాయిల తిరుగుబాటు


సిస్టర్ నివేదిత రూపకల్పన


బెంగాల్ ఉద్యమగర్జన


మేడమ్ కామా జయకేతనం


హోమ్‌రూల్ ఉద్యమ గీతిక


ప్రథమ త్రివర్ణ పతాక


తొలి జాతీయ జెండా

మనిషి సంఘజీవి. తనదైన ఉనికికోసం, సమాజంకోసం, జాతి కోసం ఎంతైనా పోరాడతాడు. ప్రాణాలైనా ఇస్తాడు. అందులో భాగంగానే తమ దేశ గౌరవానికి ప్రతీకగా నిలిచే జాతీయ పతాకాన్ని రూపొందించుకున్నాడు. అలాగని జెండాల పుట్టుక నిన్నమొన్నటిది కాదు, అనాది నుంచీ ఉన్నదే. అప్పట్లో ఓ కర్ర చివర తాము పూజించే జంతువులనీ పక్షుల బొమ్మల్నీ పెట్టి తోతమ్స్ పేరుతో తమ తెగల అస్తిత్వానికి చిహ్నంగా వాడుకునేవాడు. వాటినే యుద్ధాల్లో సంకేతాలుగా ఉపయోగించాడు.

### జెండాపై కపిరాజు!

వేదకాలం నాటికి ఆదిమ మనిషి తోతమ్స్ కాస్తా ధ్వజాలుగా మారాయి. విష్ణుమూర్తికి గరుడపక్షి, శివుడుకి వృషభం, ఇంద్రుడికి వజ్రాయుధం సంకేతాలున్న ధ్వజాలు ఉన్నట్లు పురాణాలు చెబుతున్నాయి. రాముడు తమ వంశానికి గుర్తుగా సూర్యుడు, భరతుడు కోవిధార(చెట్టు), రావణుడు కపాలబొమ్మ లున్న ధ్వజాలను వాడినట్లు రామాయణం చెబుతోంది. మహాభారతంలోని కురుక్షేత్ర సంగ్రామంలో ద్రోణుడూ, అర్జునుడూ, భీష్ముడూ, దుర్యోధనుడూ... ఇలా ఒక్కొక్కరూ ఒక్కో రకమైన ధ్వజాన్ని పట్టినట్లు తెలుస్తోంది.

చరిత్రలోకి వెళ్తే- ఝాన్సీలక్ష్మీబాయి, శివాజీ, మొఘల్ చక్రవర్తులు, రాణాప్రతాప్... వంటి వారంతా తమ సామ్రాజ్యాలకి గుర్తులుగా తమదైన సంకేతాలతో వాడిన పతాకాలు కనిపిస్తాయి. అప్పట్లో దీర్ఘచతురస్రాకారంగా ఉండే వాటిని ధ్వజం, త్రికోణాకారంలో ఉండే వాటిని పతాకం అనీ అనేవారు. కాలక్రమంలో ఆ తేడా చెరిగిపోయింది.

సుగంధద్రవ్యాల వ్యాపారం పేరుతో డచ్‌వారూ, పోర్చుగీసువారూ ఆ వెనకే బ్రిటిషర్ల ప్రవేశంతో ఆయా దేశ చిహ్నాలు మనదేశంలోకి వచ్చాయి. బ్రిటిషర్ల యూనియన్ జాక్ చిహ్నం శతాబ్దాలపాటు మనదేశాన్ని పాలించి, పీడించి, స్వాతంత్ర్య సమరాన్ని సృష్టించింది. వాళ్లను ఎదిరించే క్రమంలో ఎందరో వీరుల జెండాలు ఎగిరాయి. అన్నింటిలోకీ ఆంగ్లేయులపై తొలి పోరాటంగా పేర్కొనే 1857 సిపాయిల తిరుగుబాటులో బహదూర్‌షా ఆకుపచ్చ, బంగారు వర్ణాలు కలిపి వాడిన పతాకం దేశవ్యాప్తంగా జాతీయ భావనని రేకెత్తించింది. తరవాత 1906లో సిస్టర్ నివేదిత ఉద్యమ నేపథ్యంతో సింధూర, పసుపు వర్ణాలతో ఓ పతాకాన్ని రూపొందించింది. అంచుల్లో 108 జ్యోతులు, మధ్యలో వజ్రాయుధం, దానికిరువైపులా వందేమాతరం అని బెంగాలీలో రాసి ఉన్న ఆ జెండాని ఆనాటి కలకత్తా సభలో ప్రదర్శించారు. ఆ సమయంలోనే, బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా సచ్చీంద్రప్రసాద్ బోస్, సుకుమార్ మిత్రాలు రూపొందించిన పతాకం ఆగస్టు ఏడున పార్సీభవన్‌మీద ఎగిరి, భారతీయుల గుండెల్లో విప్లవాగ్నుల్ని రగిలించింది. ఆపై జాతీయోద్యమాన్ని మరింత బలోపేతం చేస్తూ మేడమ్ భికాజీ కామా ఆకుపచ్చ, పసుపు, ఎరుపు వర్ణాలతో జెండాని రూపొందించి, జర్మనీలోని స్టట్‌గార్ట్‌లో ఎగరేయడం ద్వారా, బ్రిటిషర్లను వ్యతిరేకిస్తోన్న భారత్‌ను మొదటిసారిగా ప్రపంచానికి పరిచయం చేసింది.

### జాతీయ పతాక!

హోమ్‌రూల్ ఉద్యమంలో భాగంగా ఐదు ఎరుపు, నాలుగు ఆకుపచ్చ రంగులతో మరో జెండా రూపుదిద్దుకుంది. సప్తరుషులను సూచిస్తూ ఏడు నక్షత్రాలతోబాటు యూనియన్ జాక్ చిహ్నాన్ని కూడా ఉంచడంతో దానికి పెద్దగా ఆదరణ లభించలేదు. ఆపై గాంధీజీ సూచనల మేరకు యావత్ భారతావనిని ప్రతిబింబించే జాతీయపతాక ఆవశ్యకతను దృష్టిలో పెట్టుకుని తెలుగువాడైన పింగళి వెంకయ్య రూపొందించిన తెలుపు, ఆకుపచ్చ, ఎరుపు రంగుల జెండా, 1921 అహ్మదాబాద్ కాంగ్రెస్ సభలో ఎగిరింది. ఉద్యమం ఊపందుకుంది. జెండా సత్యాగ్రహం, ఉప్పు సత్యాగ్రహం, సహాయ నిరాకరణ... ఇలా అన్ని ఉద్యమాల్లో దేశమంతా ఊరేగిన ఆ జాతీయ కాంగ్రెస్ పతాకానికి ప్రజలంతా భక్తితో వందనం చేశారు.

1931లో ఏర్పడిన ఫ్లాగ్ కమిటీ మతాలని విస్మరిస్తూ త్యాగనిరతికీ ఆత్మస్థైర్యానికీ ప్రతీకగా కాషాయాన్నీ; స్వచ్ఛతనీ నిజాయతీనీ చాటే తెలుపునీ; పాడిపంటల్నీ ప్రకృతితో అనుబంధాన్నీ సూచించే ఆకుపచ్చరంగునీ; సాధారణ ప్రజల్నీ వారి పరిశ్రమకీ గుర్తుగా నీలిరంగు రాట్నంతో జాతీయ పతాకాన్ని రూపొందించింది. ఉద్యమాన్ని ఏకతాటిమీదకి తీసుకొచ్చిన ఆ కాంగ్రెస్ జెండానే, జాతీయ జెండాగా దేశప్రజలందరి ఆమోదాన్నీ పొందింది. చివరకు 1947 జూన్ 3న బ్రిటిషర్లు భారత్‌ను వీడనున్నట్లు ప్రకటించడంతో మరోసారి ఫ్లాగ్ కమిటీ జాతీయ జెండామీద దృష్టి పెట్టి, మార్పుచేర్పులు చేసింది. రాట్నం స్థానంలో 24 ఆకులున్న ధర్మచక్రాన్ని పెట్టి, జాతీయ కాంగ్రెస్ జెండానే జాతి పతాకంగా రూపొందించి, జులై 22న అధికారికంగా బాబూ రాజేంద్రప్రసాద్‌కు అందించింది. అదే నేటి మువ్వన్నెల పతాకం. 1947 ఆగస్టు 15వ తేదీ ఉదయం గవర్నర్ హౌస్‌మీద 31 గన్ శాల్యూట్‌ల మధ్య భారత జాతీయ పతాకం రెపరెపలాడింది. యూనియన్ జాక్ కిందకు దిగింది. అదే రోజు మధ్యాహ్నం ఇండియా గేట్ సమీపంలోని ప్రిన్సెస్ పార్కులోనూ నెహ్రూ ఎగరేసిన త్రివర్ణ పతాకం, ఆకాశంలోని హరివిల్లుని తలపిస్తూ జాతిని హర్షాతిరేకంలో ముంచెత్తింది. అంతా అనుకున్నట్లు ఆ రోజు జెండా ఎర్రకోట మీద ఎగరలేదు. 16వ తేదీ ఉదయం 8.30 గంటలకు ఎర్రకోట మీద ఎగిరింది. ఆరోజు నుంచీ ఏటా ఆగస్టు పదిహేనో తేదీన ఎర్రకోటమీద జాతీయజెండా ఎగరేయడం సంప్రదాయంగా మారింది. భరతజాతి ప్రజల్లో నిరంతరం దేశభక్తిని రేకెత్తించే ఆ మువ్వన్నెల పతాకానికి సగౌరవంగా సెల్యూట్ చేద్దాం. జైహింద్..! ★



### ఝండా ఊంచా రహే హమారా..!

పవిత్రమైన జాతీయ పతాకాన్ని అవమానిస్తే నేరం కింద పరిగణించడం అనేది ఈనాటిది కాదు, 500 పణాలు చెల్లించాలని మనుస్మృతి ఆనాడే చెప్పింది.

★ ఫ్లాగ్‌కోడ్ నిబంధనల మేరకు జాతీయ జెండాలో కాషాయ రంగు పైకి ఉండాలి. దాన్ని తిరగేసి పెట్టకూడదు. జెండా పొడవు వెడల్పులు 3:2 నిష్పత్తిలోనే ఉండాలి. అదీ బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ రూపొందించిన తొమ్మిది రకాల సైజుల్లోనే తయారుచేయాలి. జెండాను ఖాదీ సిల్కు, నేత వస్త్రాలతో మాత్రమే తయారుచేయాలి. ప్రస్తుతం మన జాతీయ పతాకాన్ని తయారుచేసే అధికారాన్ని ఖాదీ కమిషన్, హుబ్లీకి చెందిన కర్ణాటక ఖాదీ గ్రామోద్యోగ సంయుక్త సంఘానికి మాత్రమే అప్పగించింది. దీనికి సంబంధించిన యూనిట్ ధార్వాడ జిల్లాలోని బెంగెరి గ్రామంలో ఉంది. దేశవ్యాప్తంగా ఎగిరే పతాకాలన్నీ అక్కడే రూపుదిద్దుకుంటాయి. జెండా తయారీకి అవసరమైన ఖాదీ వస్త్రం మాత్రం భాగల్‌కోట్ యూనిట్‌లో తయారవుతుంది.

# కొత్తగా...

## ఏసీ మంచానికే



పడుకునేప్పుడు గదిలో ఏసీ వేసుకుంటుంటాం. అలాంటి సందర్భాల్లో గదంతా కాకుండా మనం పడుకునే మంచం వరకూ చల్లదనం వచ్చినా సరిపోతుంది. అంత వరకే చల్లబడితే ఏసీ ఖర్చూ చాలా తగ్గుతుంది. ఇదే ఆలోచనతో యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌కు చెందిన ఎలీస్ ఇంటర్నేషనల్ మారిటైమ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, ఎలీస్ ఇంటర్నేషనల్ ఇంటీరియర్స్ సంయుక్తంగా 'సోలార్ పవర్డ్ ఎయిర్ కండిషనింగ్ బెడ్'ను తయారుచేశాయి. ఇందులో మంచం చుట్టూ ఆక్రిలిక్‌తో తయారు చేసిన ప్యానెళ్లను అమరుస్తారు. ఆ ప్రాంతం వరకే సౌరశక్తితో నడిచే ఏసీ పనిచేస్తుంది. ఈ ప్యానెళ్లను మనింట్లోని మంచానికి కూడా అనుసంధానం చేయొచ్చు. మామూలు ఏసీకయ్యే శక్తిలో ఇరవైశాతం ఖర్చుతోనే ఇది నడుస్తుంది. పాతికవేల నుంచి యాభైవేల రూపాయల దాకా ఖరీదయ్యే ఈ రకం ఏసీలు డిసెంబరు నాటికి మార్కెట్లోకి రానున్నాయట.

## 16 లెన్సుల కెమేరా...





ప్రకృతి దృశ్యాలను బంధించేందుకూ, పెద్ద కార్యక్రమాల ఫొటోలు తీసేందుకూ మంచి రిజల్యూషన్ ఉన్న కెమేరాలను వాడుతుంటారు. ప్రత్యేకించి టూర్లకోసం అలాంటి కెమేరాలను తీసుకెళ్లేవారి సంఖ్యా తక్కువేం కాదు. అయితే ఇందులో చాలా వాటికి దూరానివి తీసేందుకూ, దగ్గరవి తీసేందుకూ, చీకట్లో స్పష్టంగా కనిపించేందుకూ... ఇలా విభిన్న సందర్భాల కోసం రకరకాల లెన్సులను మారుస్తూ ఉంటారు. ఇకపై అలాంటి ఇబ్బంది లేకుండా ఏకంగా 16 రకాల లెన్సులు ఒకే కెమేరాలో ఉండేలా 'ద లైట్ ఎల్16'ను రూపొందించారు. 52 మెగాపిక్సెల్ రిజల్యూషన్ ఉండే ఇది పదిదాకా లెన్సుల సాయం తీసుకుంటూ అతి తక్కువ వెలుతురులోనూ స్పష్టంగా ఫొటోలు తీయగలదట. మామూలు కెమేరాల కన్నా 5 రెట్లు ఎక్కువ దూరంలోని వాటిని కూడా స్పష్టంగా ఫొటో తియ్యగల దీనిలో ఇంకా చాలా ప్రత్యేకతలే ఉన్నాయి.

## నడిచే డస్ట్‌బిన్



ఇంట్లో సోఫా లోనో కుర్చీల్లోనో కూర్చుని చిప్సో, పాప్‌కార్న్ ఇలా ఏదో ఒకటి తింటూ ఉంటాం. డస్ట్‌బిన్ దాకా వెళ్లి ఆ ప్యాకెట్లు పారేయాలంటే ఒక్కోసారి టీవీలో మంచి కార్యక్రమమేదో వస్తుంటుంది మళ్లీ పడేద్దాంలే అనుకుంటే అవన్నీ సోఫా పక్కనే ఉండిపోతాయి. అలాంటి ఇబ్బంది లేకుండా, అవసరమైనప్పుడు చెత్తడబ్బా మన దగ్గరికి వచ్చి, చెత్త పారేయడం అయిపోగానే మళ్లీ వెనక్కు వెళ్లిపోతే బాగుంటుంది కదూ! ఇప్పుడలా పనిచేసే డస్ట్‌బిన్ కూడా వస్తోంది. 'గోమిబా గో' అనే ఇది చక్రాలు కలిగి ఉంటుంది. రిమోట్ సెన్సర్‌తో పనిచేస్తుంది. రిమోట్ ద్వారా డస్ట్‌బిన్‌ను మనం కూర్చున్న చోటికే తెచ్చుకోవచ్చు. తిరిగి మళ్లీ ఏదో ఒక మూలలో పెట్టేయొచ్చు.

## టేపే ఫ్రేము!

కొన్ని చిత్రాల్ని, లేదా మనకు నచ్చిన కోట్స్‌ని గోడమీద అతికిస్తుంటాం. అలాంటి వాటిని అందంగా ఫ్రేమ్ కట్టినట్టు కనిపించేలా చేయాలంటే మాత్రం ఫ్రేమ్‌టేప్ ఉండాల్సిందే. ఈ రకం టేపుల మీద సాధారణానికి భిన్నంగా ఫ్రేము తరహా డిజైన్లు అచ్చేసి ఉంటాయి. పిల్లలు గీసిన బొమ్మనో, లేదా మరే నచ్చిన వాక్యాన్నో గోడకు అతికించినప్పుడు దాని చుట్టూ ఈ ఫ్రేమ్ టేపుని అతికించామంటే చూడగానే ఫొటో ఫ్రేముల్లాగే కనిపిస్తాయి. వాషి టేపులుగానూ పిలిచే వీటిలో ఎన్నో రంగులూ, డిజైన్లూ కూడా దొరుకుతున్నాయి. ఇక ఫ్రేముని ఏ ఆకృతిలో మలుస్తాం అనేది మన ఇష్టం.



## అంచు దెబ్బ తప్పించుకోవచ్చు



ఇంట్లో ఉండే డైనింగ్‌టేబుల్‌తో పాటూ కొన్ని ఫర్నిచర్ల చివరలు చాలా పదునుగా ఉంటుంటాయి. చూసుకోకుండా నడిచినా, వంగి లేచినా పెద్దవాళ్లనే అవి ఇబ్బంది పెడుతుంటాయి. ఇక వాటి ఎత్తే ఉండే చిన్న పిల్లలకైతే ఇవి మరీ ప్రమాదం. అందుకే వాళ్లు ఆ ప్రాంతంలో ఆడినా ఎలాంటి దెబ్బా తగలకుండా ఉండేందుకు బేబీ టేబుల్ గార్డ్స్ బజార్లో దొరుకుతున్నాయి. ఆల్చిప్పల్లా, బొమ్మల్లా రకరకాల ఆకృతుల్లో రంగుల్లో ఉండే వీటిని పదునైన అంచులకు పెడితే ఇక ఆ చివర్ల వల్ల పిల్లలకే కాదు ఎవరికీ ఎలాంటి ఇబ్బందీ ఉండదు.






అవకాశాన్ని సరైన సమయంలో అందిపుచ్చుకోవడం విజయానికి తొలిమెట్టు. చేతికందిన అవకాశాన్ని నిలబెట్టుకోవడం మలి మెట్టు. ఆ రెండు మెట్లనూ సమర్థంగా అధిరోహించిన ముగ్గురు యువకుల విజయ రహస్యం... స్విగ్గీ.

# హోటల్ భోజనం ఇంటికే!

అనుకోకుండా ఇంటికి అతిథులు వచ్చారు. వారితో కబుర్లు చెబుతూ అప్పటికప్పుడు భోజన ఏర్పాట్లు కూడా చేయాలంటే కుదరదు. అలాగని వారిని తీసుకుని హోటల్‌కీ వెళ్లలేం. ఏం చేస్తారప్పుడు?

రోజంతా సమావేశాలు, చర్చలు... ఆఫీసు పనితో అలసి సొలసి ఇంటికొచ్చాక వంట చేసే ఓపిక లేదు. ఏమిటి మార్గం..?

ఇలాంటి సందర్భాల్లో... హోటల్ వంటలనే ఇంటికి తెప్పించుకోవచ్చు! ఏ హోటల్ నుంచి, ఎలాంటి ఆహారపదార్థాలు తెప్పించుకోవాలో మీరే ఎంచుకోవచ్చు. అడుగు బయట పెట్టనక్కరలేకుండా అరగంటలోనే కోరుకున్న పదార్థాలు వేడి వేడిగా ఇంటికి వస్తే అంతకన్నా ఆనందమేముంటుంది? ఆ అవసరాన్నీ ఆనందాన్నీ అర్థం చేసుకున్నందునే ఈ యువ వ్యాపారస్తుల బృందం స్విగ్గీని విజయపథంలో నడిపిస్తోంది.

ఈ ఆగస్టుకి స్విగ్గీని ప్రారంభించి మూడేళ్లు. అతి తక్కువ సమయంలోనే ఫుడ్ డెలివరీ రంగంలో తనదైన ముద్ర వేసిన స్విగ్గీ ఇటీవల ఎకనమిక్‌టైమ్స్ నుంచి స్టార్టప్ ఆఫ్ ద ఇయర్ అవార్డును అందుకుంది. ప్రస్తుతం బెంగళూరు, హైదరాబాద్, దిల్లీ తదితర ఎనిమిది నగరాల్లో సేవలందిస్తోంది. ఆయా నగరాల్లో 12వేల రెస్టరెంట్లతో ఒప్పందం చేసుకుంది స్విగ్గీ. వినియోగదారులు కోరుకున్న ఆహారపదార్థాలను వారి ఇంటికే తెచ్చి అందిస్తూ నెలకు 40లక్షలకు పైగా ఆర్డర్లను చేరవేస్తోంది.

## ముగ్గురు కలిసి...

మాజేటి శ్రీహర్ష, నందన్ రెడ్డి... బిట్స్ పిలాని విద్యార్థులు. శ్రీహర్ష ఐఐఎంలో ఎంబీయే కూడా చేశాడు. నందన్ ఎంఎస్‌సి ఫిజిక్స్ చదివాడు. వీరిద్దరినీ కలిపింది ఆహారం పట్ల వీరి అభిరుచే. ఖరగ్‌పూర్ ఐఐటీ విద్యార్థి అయిన రాహుల్ జైమిని స్విగ్గీకి చీఫ్ టెక్నికల్ ఆఫీసర్‌గా సేవలందిస్తున్నాడు. స్విగ్గీ కన్నా ముందు శ్రీహర్ష, నందన్ రెడ్డి ఓ వైఫల్యాన్నీ చవిచూశారు. వీరిద్దరూ తొలుత బండిల్ టెక్నాలజీస్ పేరుతో ఓ సంస్థను పెట్టారు. అది విఫలమైంది. తర్వాత ఏమిటని ఆలోచిస్తున్న క్రమంలో ఫుడ్ డెలివరీ రంగంలో మంచి అవకాశాలు కన్పించాయి. తొలి యత్నంలో విఫలమైన అనుభవంతో పకడ్బందీగా ప్రణాళిక సిద్ధం చేసుకున్నారు. రాహుల్‌తో కలిసి 2014 ఆగస్టులో బెంగళూరులో 25 రెస్టరెంట్లతో ఒప్పందం కుదుర్చుకుని, ఆరుగురు డెలివరీ ఎగ్జిక్యూటివ్స్‌తో స్విగ్గీని ప్రారంభించారు. రాహుల్ మింత్రాలో ఉద్యోగం నుంచి బయటకు వచ్చి కొత్త అవకాశాలకోసం వెదుకుతున్న క్రమంలో ఈ ముగ్గురికీ పరిచయమైంది.

## స్విగ్గీ... ఏమిటిది?

స్విగ్గీ గురించి ఒక్కమాటలో చెప్పాలంటే ఫుడ్ డెలివరీ ఆప్. ఫోన్ లేదా వెబ్‌సైట్ ద్వారా ఆన్‌లైన్‌లో మనకు కావలసిన రెస్టరెంట్ నుంచి ఆహారపదార్థాలను ఆర్డరిస్తే నిమిషాల్లో వేడి వేడిగా వాటిని మన ఇంటికి చేరుస్తారు స్విగ్గీ సిబ్బంది. ఈ వ్యవహారమంతా నడపడానికి స్విగ్గీ సొంతంగా తయారు చేసుకున్న ఆప్‌లు ఉన్నాయి. ఆహారపదార్థాల డెలివరీ వ్యాపారంలో భాగస్వాములుగా ఉన్న రెస్టరెంట్లకూ, సిబ్బంది ఆర్డర్లను డెలివరీ చేయడానికీ, వినియోగదారులు ఆర్డర్లు ఇవ్వడానికీ... వేర్వేరు ఆప్‌లు ఉన్నాయి.

వినియోగదారు పదార్థాలు ఆర్డరు చేయగానే సంబంధిత రెస్టరెంట్‌కీ, డెలివరీ ఎగ్జిక్యూటివ్‌కీ కూడా సమాచారం వెళ్తుంది. ఆర్డర్ తీసుకున్న రెస్టరెంట్ సిబ్బంది ఆ పదార్థాలను సిద్ధం చేస్తారు. ఏ హోటల్‌నుంచి పదార్థాలు తీసుకెళ్లి ఎక్కడ ఇవ్వాలో డెలివరీ ఎగ్జిక్యూటివ్‌కి తెలుస్తుంది. అతను హోటల్‌కు చేరుకుని నిర్ణీత సమయంలో ఆహారపదార్థాలను వినియోగదారుకు చేరవేస్తాడు. ఈ పని వల్ల స్విగ్గీకేమిటి లాభం అంటే... అటు రెస్టరెంట్ల నుంచి కమిషనూ ఇటు వినియోగదారులనుంచి డెలివరీ చార్జిలనూ సంస్థ వసూలు చేస్తుంది.

'చౌకగా, వేగంగా, సమర్థంగా... పని చేస్తూ ఫుడ్ డెలివరీ మార్కెట్‌లో విప్లవాత్మక మార్పులు తేవడమే స్విగ్గీ లక్ష్యం. దేశంలో ఆతిథ్య రంగం చాలా వేగంగా విస్తరిస్తోంది. ఫుడ్ డెలివరీ ఆప్‌లు ఇప్పటికే కొన్ని ఉన్నాయి. ఇంకా వస్తాయి కూడా. అయితే సొంత డెలివరీ సిబ్బంది ఉన్న స్విగ్గీ వాటన్నిటికన్నా భిన్నంగా, సమర్థంగా సేవలందించడంలో ముందుంటుంది...' అంటారు సంస్థ వ్యవస్థాపకుల్లో ఒకరైన శ్రీహర్ష.

స్విగ్గీలో ప్రస్తుతం 20 వేలమంది డెలివరీ ఎగ్జిక్యూటివ్‌లున్నారు. వచ్చే ఐదేళ్లలో ఈ సంఖ్యను లక్షకు పెంచాలన్నది సారథుల ఆశయం. సంస్థ నిర్వహణకు నిధులను వెంచర్ క్యాపిటల్ సంస్థల నుంచి సేకరించారు. ఆహార పదార్థాలకు సంబంధించిన స్టార్టప్‌లు నిధుల సేకరణలో ఎప్పుడూ చివరి వరసలో ఉండేవి. కానీ స్విగ్గీకి పెద్ద ఎత్తున నిధులు అందడం సంస్థ విశ్వసనీయతను చాటుతోంది. త్వరగా అభివృద్ధి చెందాలన్న ఆత్రుతతో పలు కంపెనీలు చేసే పొరపాటు సేవల నాణ్యతపై దృష్టిపెట్టకపోవడం. స్విగ్గీ ఆ పొరపాటు చేయలేదు. అందుకే 80 శాతం వినియోగదారులు మళ్లీ మళ్లీ సేవలందుకోడానికి ముందుకొస్తున్నారు. స్విగ్గీ ఆప్ పది లక్షల డౌన్‌లోడ్లతో దూసుకుపోతోంది. భవిష్యత్తులో హోటళ్లూ, రెస్టరెంట్లలో మామూలు విక్రయాలకన్నా ఆన్‌లైన్ విక్రయాలే ఎక్కువ ఉంటాయన్న మార్కెట్ నిపుణుల అంచనా నేపథ్యంలో స్విగ్గీకి ఉజ్వల భవిష్యత్తు కన్పిస్తోంది కదూ! ★





కథ

# ఊరు మారినా ఉనికి మారునా...

– శ్రీమతి చంద్రికాశేఖర్

సమయం 11 గంటలు కావస్తోంది. సూర్యుడు తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. ఏసీ గదిలో మెత్తని పక్కమీద దొర్లుతున్న వీరయ్యకు అసహనంగా ఉంది. గది చాలా చల్లగా, పక్క మెత్తగా ఉన్నా, ఆయనకి స్థిమితంగా లేదు. కాసేపు అటూఇటూ దొర్లి విసుగ్గా లేచి ఏసీ ఆఫ్ చేసి బాల్కనీలోకి నడిచాడు. అక్కడున్న కుర్చీలో కూర్చుని దృష్టి కిందకి సారించాడు. హైదరాబాద్‌లోని ఒకానొక పోష్ ఏరియాలో అతి రద్దీగా ఉండే మెయిన్ రోడ్ అది. అక్కడ ఉన్న అనేక అపార్ట్‌మెంటుల్లోని ఒక అపార్ట్‌మెంట్‌లో నాలుగో ఫ్లోరులోని ఫ్లాట్ అది. సకల సౌకర్యాలున్న ఆ ఫ్లాట్‌ని కొడుకు రవీంద్ర, కోడలు యామిని ఏడాది కిందట కొనుక్కున్నారు.

రోజులో సగభాగం వీరయ్య గడిపేది అక్కడే. కిందకి చూస్తే చీమలబారుల్లా జనం, అతి వేగంగా వెళ్లే వాహనాలు. మొదట్లో ఆయనకి చాలా గాభరాగా ఉండేది. ఇప్పుడు కొద్దిగా అలవాటుపడ్డాడు. కానీ, ఇక్కడ ఎవరి జీవితాలు వారివి, ఎవరి దినచర్య వారిది. కాలంతోపాటుగా సాగాలంటే ఆ ఉరుకులు, పరుగులు తప్పవు మరి! చిన్నగా నిట్టూర్చాడతను. కొడుకూ కోడలు కూడా అంతే, ఉదయం 9 గంటలకు ఎవరి కారులో వారు వెళ్లిపోతారు. సాయంత్రం రవీంద్రే ముందుగా వస్తాడు. యామిని ఆఫీసు చాలా దూరం. ఆమె ఇంటికి వచ్చేసరికి 8 గంటలు దాటుతుంది.

అప్పుడు ఓపికగా ఉంటే వంట చేస్తుంది, లేదా ఫుడ్ సెంటర్‌కి ఆర్డరిచ్చి పుల్కాలు తెప్పించుకుంటారు. తనకు ఊళ్ళో మూడు పూటలా సుష్టుగా అన్నమే తినడం అలవాటు. కానీ, తన ఒక్కడి కోసం అన్నం వండమని అడగలేడు. ఒక గంట కూర్చున్నాక వేడిగా అనిపించి హాల్లోకి నడిచి టీవీ ఆన్ చేశాడు. ఛానెల్స్ అన్నీ మారుస్తున్నా, అతనికి ఏదీ చూడాలనిపించడం లేదు. అతనికి టీవీ చూడటం పెద్దగా అలవాటు లేదు. ఇంట్లో టీవీ ఉన్నా తన భార్యే ఎక్కువగా చూస్తూండేది. అతని ఆలోచనలు ఊరిమీదకు మళ్ళాయి. ఊళ్ళో ఉంటే ఈసరికి తమ పొలంలో ఉండేవాడు. పాలేర్లకు పనులు పురమాయిస్తూ, తనూ పనిచేస్తుంటే సమయమే తెలిసేది కాదు. అటునుండి మధ్యాహ్నానికి కొబ్బరితోటకు చేరుకునేవాడు. అలివేలు క్యారేజీ తీసుకువచ్చేది. అందరూ కలిసి కబుర్లాడుకుంటూ భోజనం చేసేవారు. అసలు తనకు ఏ రోజూ ఖాళీగా కూర్చోవడమే తెలియదు. అలాంటిది ఈ నెలరోజుల నుండీ ఖాళీగా తిని కూర్చోవాలంటే ప్రాణం మీదకి వచ్చినట్లుగా ఉంది. పని చేస్తూంటేనే తనకు హుషారుగా ఉంటుంది. ఖాళీగా ఉంటే నీరసంగా ఉంటుంది.

పొద్దున్నే లేచి పశువుల పాలు పితికి, స్నానంచేసి, చద్దన్నం తిని, పొలానికి వెళితే మళ్ళీ చీకటిపడ్డాకే ఇల్లు చేరడం. మళ్ళీ స్నానం చేసి రాత్రివేళ అలా సర్పంచ్ రాఘవయ్య ఇంటివైపు వెళితే అక్కడ ఆయన ఇంటి అరుగులమీద స్నేహితులంతా చేరేవారు. అందరూ కలిసి లోకాభిరామాయణంలో మునిగిపోతే టైమే తెలిసేది కాదు. సర్పంచ్ కూడా తన మిత్రుడే, చిన్నప్పటి నుండి తమతో కలిసి పెరిగినవాడే. అలా ఓ రెండు గంటలు గడిపి ఇల్లు చేరేసరికి, అలివేలు పని ముగించుకుని నవ్వుతూ ఎదురొచ్చేది. ఇద్దరూ కలిసి వేడివేడి అన్నం తిని, ఇంటిముందు మామిడిచెట్టు కింద మంచాలు వాల్చుకుని కబుర్లు చెప్పుకుంటూ ఏ జాముకో నిద్రపోయేవారు. అలివేలు హఠాత్తుగా మరణించడంతో తన జీవితం ఒక్కసారిగా తలకిందులైపోయింది. ఒంటరిగా మిగిలిపోయాడు.

టైమ్ ఒంటిగంట కావస్తోంది. ఆకలిగా అనిపించి డైనింగ్‌టేబుల్ దగ్గర కూర్చుని భోజనం వడ్డించుకున్నాడు. ముద్ద గొంతులోకి దిగడం లేదు. కోడలు వంట బాగానే చేస్తుంది కానీ, సిటీలో పెరిగిన పిల్ల కావడంతో ఉప్పూ కారాలూ, మసాలాలూ చాలా తక్కువగా వాడుతుంది. తనకేమో మొదటినుండీ గొడ్డుకారాలు అలవాటు. కానీ ఏ రోజూ ఆరోగ్య సమస్య రాలేదు. రవీంద్రకీ, యామినికీ ఇద్దరికీ గ్యాస్ట్రిక్ ట్రబుల్ ఉంది. తమ ఊరినుండి తెచ్చుకున్న పచ్చళ్ళు అయిపోయాయి, కోడలు పచ్చళ్ళు చేయదు.

కూర సహించక పక్కకు నెట్టి సాంబారు పోసుకున్నాడు. 'ఇంకా కొద్దిగా పోసుకోండి, సరిగ్గా తినండి, ఏమిటా తిండి?' పక్కన కూర్చుని అలివేలు దబాయిస్తున్నట్లే ఉంది. తను తింటూంటే కొసరికొసరి వడ్డించేది. కళ్ళు చెమర్చాయి. ఇక తిండి సహించక పెరుగు వేసుకుని తిని లేచాడు. చెయ్యి కడుక్కుని బెడ్‌రూమ్‌లోకి నడిచి మంచంమీద వాలాడు.

ఒంటరితనం అతన్ని దహించివేస్తోంది. పల్లెటూళ్ళో పదిమంది మధ్య మాట్లాడుతూ తిరిగే వీరయ్యకు సడెన్‌గా మూగవాడైనట్లు అనిపిస్తోంది. మనసారా మాట్లాడటానికి తహతహలాడుతున్నాడు. సాయంత్రం వచ్చాక 'నాన్నా, భోజనం చేశావా... మామయ్యా, టీ తాగారా?' లాంటి రొటీన్ ప్రశ్నలు తప్ప వారికి వీరయ్యతో మాటలేం ఉంటాయి! డిన్నర్ చేస్తూ కూడా వారిద్దరూ ఆఫీసు విషయాలే చర్చించుకుంటారు. సెలవు రోజు వస్తే ఎవరి ల్యాప్‌టాప్‌లో వారు తల దూరుస్తారు. చుట్టూ ఉన్న ఫ్లాట్‌లలో ఎవరు ఉంటారో కూడా వీరయ్యకి తెలియదు. వారితో మాట్లాడదామనుకున్నా, కొడుకు తలుపు తీసి బయటకు రావద్దని గట్టిగా చెప్పాడు. ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకున్నాడు వీరయ్య.

వీరయ్యది గోదావరి జిల్లాలోని ఒక మారుమూల పల్లెటూరు. ఊహ తెలిసిననాటి నుండీ అతనికి ఆ ఊరు తప్ప వేరే ఊరు తెలియదు. తల్లిదండ్రులకు అతనొక్కడే సంతానం. ఆ ఊరి గవర్నమెంటు స్కూలులో పది వరకూ చదివి, ఆపై తండ్రితోపాటు పొలానికి వెళుతూ పనిలోని మెలకువలు నేర్చుకున్నాడు. అతనికి 20 ఏళ్ళు నిండేసరికి వ్యవసాయాన్ని పూర్తిగా తన చేతిలోకి తీసుకుని తండ్రికి విశ్రాంతి ఇచ్చాడు. ప్రయోజకుడైన కొడుక్కి తమ దూరపు బంధువులమ్మాయి అలివేలునిచ్చి పెళ్ళిచేసి, ఒకరి తర్వాత ఒకరు ఇద్దరూ తనువు చాలించారు. 16 ఏళ్ళ వయసులో అతని జీవితంలో అడుగుపెట్టిన అలివేలు, వీరయ్యకు అన్నీ తానే అయింది. వారిద్దరి బంధువులూ ఆ ఊళ్ళోనూ చుట్టుపక్కలానే ఉన్నారు. అందుకనే ఎప్పుడో ఎరువులు కొనడానికి తప్ప పట్నం వెళ్ళేపని కూడా లేదు. అతని జీవితం మొత్తం పల్లెతోనే ముడిపడిపోయింది.

తండ్రి అతనికి మిగిల్చిన ఆస్తి పాత వసారా ఇల్లు, మూడెకరాల పొలం, కొబ్బరితోట. వాటితోనే వారి జీవితం ఆనందంగా గడిచిపోయేది. అలివేలు కూడా ఉన్న దాంట్లో సంతోషంగా సర్దుకుపోయేది. పెళ్లైన ఆరేళ్ళకు రవీంద్ర కడుపు లోపడ్డాడు. కాన్పు సమయంలో తలెత్తిన



సమస్య వలన అలివేలుకి ఇక పిల్లలు కలగరని డాక్టర్లు తేల్చారు. రవీంద్రే వారి జీవితాలకు వెలుగు అయ్యాడు. తను పెద్దగా చదువుకో కున్నా, వీరయ్యకి చదువంటే చాలా ఇష్టం. రవీంద్రని బాగా చదివించాలని అతని చిన్నప్పుడే నిర్ణయించుకున్నాడు.

వారి ఆశలకు తగ్గట్టుగానే రవీంద్ర చదువులో చాలా చురుకుగా ఉండేవాడు. గవర్నమెంట్ స్కూలులో టెన్త్ మంచి మార్కులతో పాస్ అయిన రవీంద్రను స్కూలు టీచర్ల సలహా మేరకు టౌనులోని కార్పొరేట్ కాలేజీలో చేర్పించాడు వీరయ్య. అలా అంచెలంచెలుగా ఇంజినీరింగ్, ఎంబీఏ పూర్తిచేసిన రవీంద్రకి హైదరాబాద్‌లోని పెద్ద కంపెనీలో మంచి ఉద్యోగం వచ్చింది. ఆ కంపెనీలోనే కష్టించి పనిచేసి మూడేళ్ళలోనే మంచి స్థాయికి చేరుకున్నాడు రవీంద్ర. ఊరివారంతా రవీంద్రను పొగుడుతుంటే సంతోషంగా పొంగిపోయారు అలివేలు, వీరయ్య. స్థిరపడిన కొడుక్కి పెళ్ళి చేయదలిచారు. నెమ్మదిగా తన కొలీగ్ అయిన యామినిని ప్రేమిస్తున్న విషయం వారి చెవిన వేశాడు రవీంద్ర. కొడుకు సంతోషమే తమ సంతోషంగా భావించిన వారు ఆనందంగా వారి పెళ్ళి చేశారు. యామిని కుటుంబం ఎన్నో ఏళ్ళక్రితం బొంబాయిలో స్థిరపడిపోయారు. ఆమె పుట్టిపెరిగింది అంతా అక్కడే. అయినా కూడా ఆమె అత్తమామలతో చక్కగా కలిసిపోయింది.

పెళ్లి చేసుకుని హైదరాబాద్‌లో కాపురం పెట్టారు రవీంద్ర, యామిని. వారి కోరిక మేరకు హైదరాబాద్ వెళ్ళి 15 రోజులు వారితో గడిపివచ్చారు వీరయ్య దంపతులు. యామిని కూడా వారిని సొంత తల్లిదండ్రుల్లాగే ఆదరించింది. రోజులు ఆనందంగా సాగిపోతుంటే సడెన్‌గా ఏదో విషజ్వరం వచ్చి ట్రీట్‌మెంట్ తీసుకుంటూండగానే విషమించి అలివేలు కన్నుమూసింది. ఒంటరిగా మిగిలిన తండ్రిని తమతో తీసుకువచ్చారు రవీంద్ర దంపతులు.

★ ★ ★

సాయంత్రం 5 గంటలకు పనిపిల్ల కాలింగ్‌బెల్ కొడుతుంటే వీరయ్యకి మెలకువ వచ్చింది. ఒళ్ళంతా నొప్పులుగా, తలంతా భారంగా ఉన్నట్లు తోచింది. నెమ్మదిగా లేచి తలుపుతీసి హాల్లో కూర్చున్నాడు. పనిపిల్ల గిన్నెలు కడిగేసి, బట్టలు మడతేసి, టీ పెట్టి వీరయ్యకు ఇచ్చి తాను కూడా తాగి వెళ్ళింది. టీ తాగాక తలభారం కాస్త తగ్గినట్లనిపించింది. తలుపులు వేసి హాల్లోనే సోఫాలో పడుకున్నాడు.

ఏడున్నరకు వచ్చిన రవీంద్ర, తలుపు తీసిన తండ్రిని చూస్తూనే "ఏం నాన్నా, నీరసంగా ఉన్నావు, ఒంట్లో బాగోలేదా?" అంటూనే నుదుటి మీద చేయివేసి చూశాడు. ఒళ్ళు వేడిగా ఉంది. "అయ్యో, జ్వరంగా ఉన్నట్లుంది" అంటూనే, తండ్రిని పడుకోబెట్టి తన రూమ్‌లోకి వెళ్ళి టాబ్లెట్ తెచ్చి వేశాడు. అలాగే గదిలో ముడుచుకుని పడుకున్నాడు వీరయ్య. ఫ్రెషప్ అయి వచ్చిన రవీంద్ర హాల్లోనే టీవీ చూస్తూ కూర్చున్నాడు. పది నిమిషాలకు ఒకసారి గదిలోకి వెళ్ళి తండ్రిని పలకరిస్తూనే ఉన్నాడు. గంట తర్వాత వచ్చిన యామిని విషయం విని గదిలోకి వచ్చింది.

"ఎలా ఉన్నారు మావయ్య, జ్వరం తగ్గిందా" ఆదుర్దాగా నుదుటిపై చేయి వేస్తూ అడిగింది యామిని.

"ఫర్వాలేదమ్మా, తగ్గింది" నీరసంగానే అన్నాడు వీరయ్య. ఆ రాత్రి వీరయ్యకు వేడివేడి ఇడ్లీపెట్టి కాసిని పాలు తాగించింది యామిని. జ్వరం తగ్గింది కానీ వీరయ్యకు మనసంతా బెంగగా, దిగులుగా ఉంది. రవీంద్ర తన దగ్గరే పడుకుంటానన్నా వద్దని వారించాడు. పదేపదే తన ఊరూ, తన ఇల్లూ, తన వాళ్ళూ గుర్తొస్తున్నారు వీరయ్యకు. భార్యా వియోగం ఆయనని బాగా బాధిస్తోంది. ఏరోజూ కంటనీరు పెట్టని వీరయ్య ఆ రాత్రంతా భార్యను తలచుకుని ఏడుస్తూనే ఉన్నాడు. 'అలివేలూ, నన్ను ఒంటరిగా వదిలి ఎందుకు వెళ్ళావు, నన్ను కూడా నీ దగ్గరకు తీసుకుపో' అంటూ రోదించాడు. తెల్లవారుజామునకి మళ్ళీ



జ్వరం ఎక్కువైపోయింది వీరయ్యకి.

తెల్లవారింది. 7 గంటలకు లేచి మామగారి గదిలోకి వచ్చిన యామిని అదిరిపడింది. జ్వర తీవ్రతతో, అపస్మారకంలో మూలుగుతున్నాడు వీరయ్య. గబగబా రవీంద్రను లేపింది యామిని. తండ్రి పరిస్థితి చూసి వెంటనే హాస్పిటల్‌కి తీసుకెళితే మంచిదనుకున్నాడు రవీంద్ర. వెంటనే తన ఫ్రెండైన డాక్టర్ ఆనంద్‌కి ఫోనుచేసి అంబులెన్స్ పంపమని అడిగాడు. పావుగంటలో అంబులెన్స్ వచ్చింది. వారు వెళ్ళేసరికి ఆనంద్ కూడా వచ్చాడు. ఐసీయూలో అడ్మిట్‌చేసి ట్రీట్‌మెంట్ మొదలుపెట్టారు.

యామినిని లీవ్ పెట్టవద్దని, తానే దగ్గరుండి తండ్రిని చూసుకుంటానని చెప్పి పంపేశాడు రవీంద్ర. గంటలో వీరయ్యకి జ్వరం కంట్రోల్ అయింది. హమ్మయ్య, ఇక ఫర్వాలేదు అనుకుని ఇంటికి వెళ్ళి, ఫ్రెషప్ అయి మళ్ళీ హాస్పిటల్‌కి వచ్చాడు రవీంద్ర. అప్పటికి వీరయ్యకి బాగా మెలకువ వచ్చింది.

"ఎలా ఉంది నాన్నా" తండ్రి చేయి పట్టుకుని ప్రేమగా అడిగాడు రవీంద్ర. బదులుగా చిన్నగా నవ్వి, నీరసంగా తలూపాడు వీరయ్య. ఆ రోజల్లా తండ్రిని కనిపెట్టుకుని హాస్పిటల్లోనే ఉండిపోయాడు రవీంద్ర. యామిని కూడా సాయంత్రం నేరుగా అక్కడికే వచ్చింది. ఇక ఫర్వాలేదు, రేపు సాయంత్రం డిశ్చార్జి చేసేస్తాను అన్నాడు ఆనంద్. కానీ, మళ్ళీ ఆ రాత్రి వీరయ్యకు తీవ్రంగా జ్వరం వచ్చింది. అపస్మారకంలోకి వెళ్ళి ఏదేదో కలవరిస్తున్నాడు. రవీంద్రకి ఏమీ పాలుపోవడం లేదు. వెంటనే ఇంజక్షన్స్ చేశాడు ఆనంద్. రవీంద్రకి ధైర్యం చెప్పాడు. తండ్రి చేతిని పట్టుకుని పక్కనే కూర్చున్నాడు రవీంద్ర. అతనికి ఊహ తెలిశాక తండ్రిని ఎప్పుడూ ఆ పరిస్థితిలో చూడలేదు. కడుపునిండా తినడం, కష్టపడి పనిచేయడం మాత్రమే తెలుసు అతనికి. ఎప్పుడన్నా ఏ జలుబో, జ్వరమో వచ్చినా ఒక్కపూట మాత్రం విశ్రాంతిగా ఉండేవాడు. మళ్ళీ వెంటనే లేచి పొలానికి వెళ్ళిపోయేవాడు.

నర్స్ మధ్యలో వచ్చి చూస్తూనే ఉంది. అర్ధరాత్రి అయింది, అంతా నిశ్శబ్దంగా ఉండటంతో తండ్రి మాట ఇప్పుడు కొద్దిగా స్పష్టంగానే వినపడుతోంది రవీంద్రకి. "రాఘవయ్యా, సర్పంచ్‌వి అయి ఉండీ, ఆ రోడ్ల గురించి పట్టించుకోవేమిటయ్యా? ఈసారి మన ఊరికి రోడ్డు మంజూరయ్యేలా ఎమ్మెల్యేగారితో గట్టిగా మాట్లాడాలి. ఏం నరసయ్య బావా, తమ్ముడితో ఆస్తి గొడవలటగా... చిన్నవాడు, అతనికి తెలీకుంటే మనమే సర్దిచెప్పాలి. ఏరా, వెంకన్నా, ఆరోగ్యం బాగాలేదుట, ఇప్పుడెలా ఉంది? ఇదుగో అలివేలూ, రాజారావుగారి అబ్బాయి రేపు హైదరాబాద్ వెళుతున్నాడట, అరిసెలూ, సున్నుండలూ చెయ్యి- అబ్బాయికి పంపుదాం. ఆ వెళ్ళేది గోవిందం కదూ, ఓరోరి పట్నంవెళ్ళి భలేగా మారిపోయాడే" ఇలా పొంతనలేకుండా సాగుతున్నాయి కలవరింతలు.

నిశ్చేష్టుడై వింటున్నాడు రవీంద్ర. తండ్రి మనసేమిటో అతనికి ఇప్పుడు పూర్తిగా అర్ధమైంది. అతనిలో పశ్చాత్తాపం మొదలయింది. తను ఎంత పొరపాటు చేశాడు, తండ్రిని బాగా చూసుకోవాలనే తాపత్రయంలో ఆయన మనసును అర్ధంచేసుకోకుండా ఆ ఊరి నుండీ, ఆప్తుల నుండీ దూరంచేసి ఆయనను అనారోగ్యం పాలుచేశాడు. తన వివేకం ఏమయింది? ఆ ఊరితో ఆయనకున్న అనుబంధాన్ని అర్థం చేసుకోకుండా, తన దగ్గర పంజరంలో బంధించి ఎంత కష్టపెట్టాడు! ఆయనను తన దగ్గరే ఉంచుకుని చూసుకోవడం తన బాధ్యత అనుకున్నాడేగానీ, ఆయన సంతోషం ఎక్కడ ఉందో అర్థంచేసుకోలేకపోయాడు. ఆయనకు ఆ ఊరు తప్ప వేరే ప్రపంచం తెలీదు. భార్యకు దూరమై బాధపడుతున్న ఆయనను ఆ ఊరికి కూడా దూరం చేశాడు. మొక్కను అది సహజంగా భూమి నుండి మొలిచినచోటే నీళ్ళుపోసి పెంచాలి. దాని వేర్లు పీకి వేరొకచోట నాటి, నీళ్ళుపోసినా అది వాడిపోదా! రాత్రంతా ఆలోచించిన రవీంద్ర ఒక నిర్ణయానికి వచ్చాడు.

కాసేపటికి వీరయ్య జ్వరం తగ్గి నిద్రలోకి జారుకున్నాడు. ఒక గంట పడుకుని లేచాడు రవీంద్ర. ఆసరికి తెల్లవారవస్తోంది. సెల్ తీసుకుని బాల్కనీలోకి నడిచి యామినితో అరగంట మాట్లాడాడు. ఆ తరువాత తమ ఊరిలోని కొందరు బంధువులతోనూ, సర్పంచ్ తోనూ కూడా మాట్లాడాడు. అందరూ అతని నిర్ణయాన్ని హర్షించారు.

మరో రెండురోజులు హాస్పిటల్లోనే ఉండి డిశ్చార్జ్ అయ్యాడు వీరయ్య. ఇంటినుండి ఆయన బట్టలు తెప్పించి కారు డిక్కీలో సర్దించాడు రవీంద్ర. నెమ్మదిగా వీరయ్యను తీసుకువచ్చి కారు వెనుక సీట్లో పడుకోబెట్టాడు. తలకింద దిండు ఎత్తుపెట్టి, విండోస్ క్లోజ్ చేసి బయలుదేరాడు. కొడుకు తనను ఎక్కడికో తీసుకెళ్తున్నాడని అర్థమైంది వీరయ్యకి. కారు మధ్యాహ్నానికి విజయవాడ చేరింది. అక్కడ ఒక హోటల్ దగ్గర ఆపి తండ్రికి ఇడ్లీ పెట్టించి, గ్లాసు పాలు తాగించాడు. తర్వాత తాను కూడా భోజనం చేసి తిరిగి ప్రయాణం మొదలుపెట్టారు.

కారు ఏలూరు, తాడేపల్లిగూడెం, తణుకు మీదుగా ప్రయాణించి సిద్ధాంతం బ్రిడ్జిని దాటి రావులపాలెంలోకి ప్రవేశించి అక్కడి నుండి ర్యాలీ వెళ్ళే రోడ్డుకు తిరిగింది. ఆ రోడ్డులో 2 కిలోమీటర్లు ప్రయాణించాక ఎడమవైపుకి తిరిగింది. పచ్చని అరటిచెట్లూ, దట్టమైన కొబ్బరితోటల మధ్యలోని ఊబలంక వారి ఊరు. అప్పటికే నిద్రలేచిన వీరయ్య కిటికీలో నుండి బయటకు చూస్తున్నాడు. ఆ పరిసరాలు గుర్తుపడుతూనే అతని కళ్ళు ఆశ్చర్యంతో పెద్ద వయ్యాయి. మిర్రర్‌లో నుండి తండ్రి ముఖంలో కనపడే మార్పులను గమనిస్తున్నాడు రవీంద్ర.

ఊరిలోకి ప్రవేశించిన కారు పంచాయితీ ఆఫీసు, స్కూలు దాటి కుడివైపుకి మలుపు తిరిగి రామాలయం దాటి సరాసరి ఆ రోడ్డుకు చివరనున్న విశాలమైన పెంకుటింటి ముందు ఆగింది. ఆసరికి టైము 8 గంటలు కావస్తోంది. చల్లగాలికి వాకిళ్లలో కూర్చుని పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నవారంతా ఆ కారుని ఆసక్తిగా చూస్తున్నారు. కారు ఇంటిముందు ఆగుతూనే జనం బిలబిలా చుట్టుముట్టారు. సర్పంచ్ రాఘవయ్య, పక్కింటి కాంతం పిన్ని, వీరభద్రం బాబాయ్, ఎదురింటి సుబ్బాయమ్మ అత్త, పూజారి శేషాచార్యులుగారు, ఆయన భార్య, ఇంకా తండ్రి స్నేహితులు, దూరపు బంధువులు అందరూ ఉన్నారు. కారు దిగిన రవీంద్ర బ్యాక్‌డోర్ తీసి వీరయ్యని నెమ్మదిగా దింపాడు. పాలేరు వెంకన్న ముందుకు వచ్చి వీరయ్యను జాగ్రత్తగా పట్టుకుని లోపలకు నడిపించాడు.

కాలు నేలమీద మోపుతూనే వీరయ్యకు ఒళ్ళు పులకరించింది. తను మళ్ళీ ఈ ఇంటికి వస్తాననుకోలేదు. ఈ మట్టిని చూడకుండానే తాను మట్టిలో కలిసిపోతాననుకొన్నాడు. కళ్లలో నీళ్ళు తిరిగాయి వీరయ్యకి. తాము వస్తున్నట్లు రవీంద్ర ముందే ఫోన్ చేయడంతో ఇల్లంతా శుభ్రంచేసి ఉంచింది కాంతం పిన్ని. వసారాలో ఉన్న మంచంపైన తండ్రిని కూర్చోబెట్టాడు రవీంద్ర.

"ఏం వీరయ్య బావా, అలా అయిపోయావు, అసలేమిటి అనారోగ్యం? అయ్యగారు ఊరిమీద బెంగపెట్టుకున్నారా?" రకరకాల ప్రశ్నలు. రవీంద్రే అందరికీ సమాధానం చెబుతున్నాడు. వీరయ్య చిరునవ్వుతో అందరినీ చూస్తూ మౌనంగా కూర్చున్నాడు. కాసేపు మాటలు అయ్యాక, విశ్రాంతి తీసుకోమని చెప్పి అందరూ వెళ్ళిపోయారు.

ఈలోగా కాంతం పిన్ని వేడిగా ఫలహారం తీసుకొచ్చింది. "కాళ్ళూ చేతులూ కడుక్కుని టిఫిన్ తిని పడుకోండి రవిబాబూ, అలసిపోయున్నారు. పొద్దున్నే వస్తాను" అంటూ కాంతమ్మ పిన్ని వెళ్ళిపోయింది.

"మీరు వెళ్ళి పడుకోండి నాన్నా, తలుపులు వేసి వస్తాను" అంటూ వాకిట్లోకి వెళ్ళాడు రవీంద్ర.

పడకగది దగ్గరకు నడిచిన వీరయ్య నెమ్మదిగా తలుపు తోసుకుని లోపలికి అడుగు పెట్టాడు. చుట్టూ పరికించి చూశాడు. ఆయన



జీవితంలోని ఎన్నో ముఖ్యమైన జ్ఞాపకాలు ఆ గదితోనే ముడిపడి ఉన్నాయి. పందిరి మంచం మీద పడుకున్న వీరయ్యకి స్వర్గంలో అడుగుపెట్టినట్లే ఉంది. కిటికీలోనుండి చల్లని పైరగాలి పరామర్శిస్తున్నట్టు తాకింది. కిటికీ పక్కన మల్లెతీగ పలకరిస్తున్నట్లుగా చూస్తోంది. గోడమీద దండవేసి ఉన్న ఫోటోలో నుండి అలివేలు 'వచ్చేశారా' అని పలుకరిస్తున్నట్లుగా నవ్వుతోంది.

భార్య ఫొటోవైపే చూస్తూ నిద్రలోకి జారుకున్నాడు వీరయ్య. లోపలకు వచ్చిన రవీంద్ర ప్రశాంతంగా నిద్రపోతున్న తండ్రిని చూశాడు. 'రెండు రోజులక్రితం ఇదే సమయానికి ఎంత ఆందోళనగా ఉన్నాడు, ఈరోజున ముఖంలో ఎంత నిశ్చింత. ఇక తన తండ్రి ఆరోగ్యానికేం ఢోకాలేదు' అనుకుంటూ పక్కనే మరో మంచం వాల్చుకున్నాడు రవీంద్ర. రోజల్లా డ్రైవ్‌చేసి ఉన్నాడేమో ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాడు రవీంద్ర.

పక్కింటివారి కోడి బిగ్గరగా కూయడంతో ఉలిక్కిపడి లేచాడు. సెల్‌లో టైమ్ చూస్తే 8 గంటలు అయింది. తండ్రి మంచంకేసి చూశాడు పక్క ఖాళీగా ఉంది. 'నాన్న అప్పుడే లేచాడన్నమాట' అనుకుంటూ బయటకు నడిచాడు రవీంద్ర. వసారాలోకి రాగానే అతనికి మనోహరమైన దృశ్యం కనిపించింది.

ఇంటి ముందున్న మామిడిచెట్టు అరుగుల మీద కూర్చుని ఉన్నాడు వీరయ్య. అతని పక్కనా, ఎదురుగానున్న కుర్చీలలో సర్పంచ్, మరికొందరు ఊరివారు కూర్చుని ఉన్నారు. కాంతం పిన్ని అందరికీ కాఫీలు అందిస్తోంది. ఆ కాఫీగ్లాసు అందుకుంటూ ఏదో బిగ్గరగా అన్నాడు రాఘవయ్య. అంతే అందరూ పగలబడి నవ్వారు. కన్నార్పకుండా తండ్రినే చూస్తున్నాడు రవీంద్ర. కాస్త నీరసంగా, బలహీనంగా కనిపిస్తున్నా చాలా సంతోషంగా ఉన్నాడు ఆయన. చిన్నపిల్లాడిలా మనసారా నవ్వుతున్నాడు. తండ్రివైపే చూస్తూ కొబ్బరిచెట్ల కిందకి నడిచాడు. సెల్ తీసి యామినికి కాల్ చేశాడు.

"హలో రవీ, క్షేమంగా చేరారా, మావయ్య ఎలా ఉన్నారు?" అడిగింది యామిని.

"బాగున్నారు యామినీ, చాలా బాగున్నారు. మళ్ళీ ఇదివరకటి నాన్నని చూస్తున్నాను" సంతోషంగా అన్నాడు రవీంద్ర.

"మరి మావయ్యని అక్కడే ఉంచేస్తారా?" సంశయంగా అడిగింది యామిని.

"అవును యామినీ, ఇక ఆయన ఇక్కడే ఉంటారు. ఆయన జీవితపు చివరిదశలో ప్రశాంతంగా, ఆనందంగా గడుపుతారు. ఈ ఊరు ఆయనకి ప్రాణం. ఆయన సంతోషం ఇక్కడే ఉందని అర్థమయింది. పొలం కౌలుకిస్తాను. కొబ్బరి, అరటితోటలు పాలేరు వెంకన్న జాగ్రత్తగా చూసుకుంటాడు. వాటిమీద వచ్చే ఆదాయం ఆయనకు చాలు. అంతేకాదు, వెంకన్న మనకి బాగా నమ్మకస్తుడు. చిన్నతనం నుండీ మన ఇంట్లోనే పనిచేస్తున్నాడు. వెంకన్ననీ, అతని భార్యనీ వెనకవైపున రెండు గదులలో ఉండి నాన్నకి వండిపెడుతూ, ఆయన మంచిచెడులు చూడమన్నాను. అందుకుగానూ జీతం ఏర్పాటుచేస్తానని చెప్పాను. వారు అందుకు ఆనందంగా అంగీకరించారు. ఇంకో వారం రోజులుండి నాన్న బాగా కోలుకోగానే ఆయనకు ఇక్కడ అన్ని ఏర్పాట్లూ చేసి వస్తాను. ఆయనకి ఒక సెల్ కూడా కొని ఇస్తున్నాను, రోజూ మనతో మాట్లాడటానికి" అన్నాడు రవీంద్ర.

"సరే, నీ ఇష్టం రవీ! నువ్వు అన్నీ బాగా ఆలోచించే నిర్ణయం తీసుకుని ఉంటావు. మావయ్య జాగ్రత్త" మనస్ఫూర్తిగా అంది యామిని.

"బై యామినీ, ఇక ఉంటాను" సెల్ ఆఫ్ చేస్తూ ఇటువైపు తిరిగాడు రవీంద్ర. అప్పుడే కొడుకు వైపు చూసిన వీరయ్య నవ్వుతూ అతన్ని రమ్మన్నట్టుగా చేయూపాడు.

సెల్ జేబులో పెట్టుకుంటూ తండ్రివైపు నడుస్తోన్న రవీంద్రకి గుడిలో నుండి మోగుతున్న గంటలు మృదుమధురంగా వినిపిస్తున్నాయి... అతని నిర్ణయాన్ని హర్షిస్తున్నట్లుగా!

★



# గోరింట నగలు!

**అమ్మాయిలకు నగలంటే ఎంతిష్టమో మాటల్లో చెప్పలేం. అలాగే గోరింటాకు పెట్టుకోవడం అన్నా అంతే ఇష్టం. అందుకే ఆ రెండింటిమీదా ఉన్న ఇష్టాన్ని కలగలిపి గోరింటతోనే నగలు పెట్టేసుకుంటున్నారు. అవునండీ, ఇప్పుడు మెహందీలో ఆభరణాల డిజైన్లదే సరికొత్త హవా మరి.**

అరచేతిలో మాత్రమే గోరింటాకు పెట్టుకోవడం అనేది పాతకాలం ఫ్యాషన్. ఇంకా చెప్పాలంటే అస్సలు గోరింట అన్న పదాన్నే నేటి తరం మర్చిపోయిందన్నా ఆశ్చర్యం లేదు. ఎందుకంటే దానికి బదులుగా 'మెందిక' అనే సంస్కృత పదం నుంచి వచ్చిన 'మెహందీ' పదమే ప్రపంచవ్యాప్తంగా ప్రాచుర్యం పొందింది. ఆ పేరుతో పెళ్లికి ముందు ప్రత్యేకంగా వేడుక చేసుకోవడం, మోచేతుల వరకూ మెహందీ పెట్టించుకోవడం సంప్రదాయంగా మారిపోయింది.

ఆ మెహందీలోనూ బోలెడు డిజైన్లు... మొదట్లో కాస్త లావుపాటి అవుట్‌లైన్లతోనూ పూలూ కొమ్మలతో సింపుల్‌గా ఉండే అరబిక్ డిజైన్లూ; ఎక్కువ వంపులతో ఉండే సంప్రదాయ మొఘలాయీ డిజైన్లదే హవా. తరవాత్తరవాత ఆకులూ పువ్వులూ లతలూ కొమ్మలతోపాటు నెమళ్లూ చిలకలూ వంటి పక్షుల్నీ, గులాబీ తామర పుష్పాల్నీ చొప్పించి, ఎక్కడా చిన్న ఖాళీ లేకుండా వేసే భారతీయ డిజైన్లే మనవాళ్లకు బాగా నచ్చాయి. దాంతో వాటికే సందర్భానికనుగుణంగా మార్పుచేర్పులు చేస్తున్నారు. ముఖ్యంగా పెళ్లికోసమయితే అచ్చుగుద్దినట్లుగా పెళ్లికూతురూ, పెళ్లికొడుకుల చిత్రాలతోబాటు మొత్తం పెళ్లితంతులోని సన్నివేశాలన్నింటినీ కూడా చేతుల్లోనే చూపించేస్తున్నారు. ఇప్పుడు వాటి సరసన కొత్తగా ఆభరణాల డిజైన్లనీ చొప్పించి, చేతుల్ని గోరింట ఆభరణాలతో అలంకరిస్తున్నారు.

అసలే శ్రావణమాసం... అందులోనూ పండగలూ పెళ్లిళ్లూ నోములూ వ్రతాల కోలాహలం... మరి మెహందీ సందడి లేకుంటే ఎలా... అందుకే ఎంచక్కా వేళ్లకి పెట్టుకునే ఉంగరాలూ, వేళ్లకీ మణికట్టుకీ కలిపి పెట్టుకునే మణిబంధనాలూ, బ్రేస్‌లెట్లూ, గాజులూ, కాళ్ళ పట్టీలూ, మెట్టెలూ... ఇలా చేతులకీ కాళ్లకీ పెట్టుకునే నగల డిజైన్లలో గోరింటాకు పెట్టుకుని మురిసిపోతున్నారు. పాశ్చాత్య దేశాల్లో అయితే చెవిపోగులూ కఫ్‌లతోబాటు మెడలో నెక్లెస్‌ల డిజైన్లను సైతం హెన్నాతో పెట్టించుకునేందుకు సరదాపడుతున్నారట. నిజానికి ఆభరణాల రూపంలో మెహందీని పెట్టుకోవడం అనేది ఈజిప్టు, మొరాకో వంటి దేశాల్లో ప్రాచీన కాలం నుంచీ ఉంది. ఒంటిమీద ధరించే అన్ని రకాల ఆభరణాల డిజైన్లలోనూ అక్కడ మెహందీ పెట్టించుకుంటారు. మనదగ్గర ఇప్పుడిప్పుడే ఈ గోరింట నగలపట్ల ఆకర్షితులవుతున్నారు. వాటిల్లోనూ వేళ్లకీ మణికట్టుకీ కలిపి పెట్టుకునే మణిబంధనాల్లో వచ్చే రకరకాల డిజైన్లయితే అమ్మాయిల చేతులపైన మరీ అందంగా మెరుస్తున్నాయి. అయితే పండినప్పటికన్నా పెట్టుకున్నప్పుడే ఆ డిజైన్లు మరింత అందంగా కనిపిస్తుండటంతో ఆ గోరింట చేతుల్ని వెంటనే ఫొటోల్లో బంధించేసి ఇన్‌స్టాగ్రాముల్లో పెట్టేయడం ఓ ట్రెండయిపోయింది. ఏదయితేనేం... డిజైన్లు మీకూ నచ్చితే ట్రై చేసి చూడండి..!

# బాల వినోదిని

## చెప్పండి చూద్దాం!

**ఈ** బొమ్మను చూసి 'F' అక్షరంతో మొదలయ్యే కొన్ని పదాలు చెప్పండి.



## ఏ రంగు?

**ఇ**క్కడ గడుల్లో ఉన్న ఎరుపు, పసుపు రంగుల్లో ఏ రంగు ఎక్కువగా ఉందో కనుక్కోండి?



## ఏది భిన్నం?

**బొ**మ్మలోని పడవల్లో ఒకటి మాత్రం మిగతా వాటికి భిన్నంగా ఉంది. అది ఏదో కనిపెట్టండి?




## మంచి పని

మీ పరిసరాల్లో రోడ్లు గుంటలు పడి ఉండటం చూసే ఉంటారు కదూ! వానాకాలంలో అయితే ఈ గుంతలు నీళ్లు నిండి ఇంకా ప్రమాదకరంగా మారతాయి. అలా ఈ మధ్య జరిగిన ఓ యాక్సిడెంట్‌ను ఇక్కడ కనిపిస్తున్న రవితేజ అనే ఆరోతరగతి పిల్లాడు చూశాడు. ఇతను హైదరాబాద్‌లో ఉంటాడు. అక్కడ రోడ్డు మీద బండిమీద వెళుతున్నప్పుడు గుంటను తప్పించే ప్రయత్నంలో దాని మీద ఉన్న ముగ్గురికీ తలకు గాయాలయ్యాయి. అది చూసిన రవితేజకు చాలా బాధేసింది. ఇలా ఇంకెవరికీ జరగకూడదను కొని రోడ్డు మీద ఎక్కడ గుంత కనపడినా దాన్ని తనే పూడ్చడం మొదలు పెట్టాడు. విరిగిపోయిన ఇటుకలూ, కంకరా, సిమెంటు బిళ్లలూ పోగేసి దానికోసం వాడుతున్నాడు. భలే మంచి పని చేస్తున్నాడు కదూ!



## గప్‌చుప్

1. ఇక్కడ పిల్లలు చాలాసేపటి నుంచి స్వచ్ఛభారత్ చేస్తున్నారు. అందులో ఒకరు ఇప్పుడే వచ్చి చేరారు. ఎవరది?

2. ఐదో నంబరు కుర్రాడు దొరికిన నీళ్ల బాటిల్‌ను వింతగా ఎందుకు చూస్తున్నాడు?

3. నాలుగో నంబరు అబ్బాయి ఒక వస్తువు వెతుకుతున్నాడు, ఏమిటది? ఎక్కడుంది?

4. ఇక్కడ ఒక సామ్యం ఉన్న ఆంగ్ల అక్షరాలు ఉన్నాయి. అవి ఏవి?

5. ఈ పక్షి గుడ్లకోసం వెతుకుతోంది. ఎక్కడున్నాయో చెప్పండి.

6. ఇక్కడ ఓ ఆట ఉంది. కనిపించిందా?

7. రిమోట్ కారు కదులుతోంది. మరి ఆ రిమోట్ ఎక్కడుంది?



## లెక్కలెక్కే...

వెంకూ టింకూ స్నేహితులు. ఒకసారి ఇద్దరూ ఒకదార్లో నడుచుకుంటూ వెళ్లారు. అప్పుడు వాళ్లకు రోడ్డు వెంట ఒక సంచీ కనిపించింది. దాన్నిండా బంగారం, డబ్బు ఉన్నాయి. దాన్ని తెరిచిచూసి 'అబ్బ, నేను ఎంత అదృష్టవంతుడిని' అన్నాడు టింకూ. 'అలా కాదు టింకూ మనిద్దరం కలిసి దాన్ని చూశాం. కాబట్టి మనం ఎంత అదృష్టవంతులం అనాలి' అన్నాడు వెంకూ. 'లేదు లేదు నేనే దాన్ని మొదట చూశాను, తెరిచాను. కాబట్టి ఇవన్నీ నావే' అన్నాడు టింకూ. దాని కింక వెంకూ ఏమీ మాట్లాడ లేదు. టింకూనే ఆ మూట పట్టుకుని నడుస్తున్నాడు. కాసేపటికి ఆ వెనక నుంచి, కొంత మంది 'దొంగ దొంగ... పట్టుకోండి పట్టుకోండి' అంటూ కర్రలు పట్టుకుని పరిగెత్తుకొస్తున్నారు. అది గమనించిన టింకూ వెంకూతో 'మన దగ్గర ఈ సంచీని చూస్తే వాళ్లు మనల్ని పట్టుకొని చితక్కొడతారు. పద పరిగెడదాం' అన్నాడు. దానికి వెంకూ 'మన దగ్గర కాదు నీ దగ్గర సంచీ ఉంది. దాన్ని వాళ్లు చూస్తే నిన్ను చితక్కొడతారు. కాబట్టి నువ్వే పరిగెట్టాలి' అంటూ తన దారిన తాను పోయాడు. స్వార్థంతో వ్యవహరించడం వల్ల మిత్రులు కూడా దూరమవుతారని అప్పుడర్థమైంది టింకూకి.



## దారి కనుక్కోండి

కింద ఉన్న యాంకర్, పైన కనిపిస్తున్న ఏ పడవకు సంబంధించిందో కనుక్కోండి.




## ముక్క ఏది?






పైన గళ్లలో ఉన్న భాగాల్లో బొమ్మలో ఉన్నవేవో గుర్తించండి.

## త్వరగా...

ఇప్పుడు చెప్పే కూడికను మీ మనసులోనే గబగబా చేసేయండి. 40ని 1000కి కలపండి. దానికి మరో 1000 కలపండి. దానికో 30 కలపండి. ఆ జవాబుకు మరో 1000 కలిపి 20 కలపండి. ఇప్పుడు ఇంకో 1000, ఇంకో 10 కలపండి. జవాబు ఏంటి?




## రంగులేద్దాం



## జవాబులు

గప్‌చుప్: 1. నంబరు లేని పిల్లాడు 2. నీళ్ల వంకరగా ఉన్నాయి. 3. షూ, ఏడో నంబరు అమ్మాయి చేతిలో 4. ఇంగ్లిషు అచ్చులు, A E I O U 5. ఒకటో నంబరు అమ్మాయి చేతిలో 6. దాడి ఆట, పక్షి వెనక 7. E అని రాసి ఉన్న బ్యాగులో.

చెప్పండి చూద్దాం!: Frog, Fox, Fire, Flower, Flag, Flamingo, Fish, Fruit, Forest.

ఏది భిన్నం?: 6, సూర్యుడు

దారి కనుక్కోండి: B

ఏ రంగు?: పసుపు, (చదరాలుగా విభజించి లెక్కిస్తే సులభం)

ముక్క ఏది?: 2, 3, 5.

త్వరగా...: 5000 వస్తే మరోసారి లెక్క పెట్టండి. జవాబు 4100.

# కమ్మకమ్మగా కట్లెట్లూ కబాబులూ!




## హరాభరా కబాబ్



### కావలసినవి

బంగాళాదుంపలు: పావుకిలో, బఠాణీలు: అరకప్పు, పాలకూర తురుము: అరకప్పు, కొత్తిమీర తురుము: అరకప్పు, అల్లం తురుము: టీస్పూను, చాట్‌మసాలా: 2 టీస్పూన్లు, ఉప్పు: తగినంత, నూనె: వేయించడానికి సరిపడా

### తయారుచేసే విధానం

★ బంగాళాదుంపలు మరీ మెత్తగా కాకుండా సగం ఉడికించి పొట్టు తీసి ముక్కలుగా చేయాలి. పాలకూర వేడినీళ్లలో వేసి తీయాలి. బఠాణీలు కొద్దిగా ఉడికించి తీసి అన్నీ కలిపి మిక్సీలో మెత్తగా రుబ్బాలి. దీనికి కొత్తిమీర తురుము, అల్లం తురుము, ఉప్పు, చాట్‌మసాలా కలిపి ఓ గంట ఫ్రిజ్‌లో ఉంచాలి. మిశ్రమాన్ని గుండ్రని ఉండల్లా చేసి వడల్లా వత్తి పెనం మీద కొద్దిగా నూనె వేసి రెండువైపులా కాల్చి తీసి చట్నీ లేదా సాస్‌తో అందించాలి.

## కార్న్ బాల్స్



### కావలసినవి

మైదా: కప్పు, పాలు: 2 కప్పులు, వెన్న: 2 టేబుల్‌స్పూన్లు, మొక్కజొన్న గింజలు: కప్పు, బంగాళాదుంపలు: నాలుగు, చీజ్ తురుము: 4 టేబుల్‌స్పూన్లు, పచ్చిమిర్చి: నాలుగు, పన్నీర్: పావుకిలో, చిల్లీసాస్: టేబుల్‌స్పూను, ఉప్పు: రుచికి సరిపడా, బ్రెడ్ పొడి: కప్పు, నూనె: తగినంత

### తయారుచేసే విధానం

★ బాణలిలో వెన్న వేసి కరిగాక, మైదా వేసి ఓ నిమిషం తిప్పాలి. తరవాత పాలు పోసి మిశ్రమం చిక్కని సాస్‌లా అయ్యేవరకూ ఉడికించాలి. బంగాళాదుంపల్ని ఉడికించి పొట్టు తీసి ముద్దలా చేయాలి. పన్నీర్ కూడా చిదమాలి. ఓ గిన్నెలో మొక్కజొన్న గింజలు, చీజ్ తురుము, బంగాళాదుంపల ముద్ద, పన్నీర్, పచ్చిమిర్చి ముక్కలు, ఉప్పు, చిల్లీసాస్, తగినన్ని నీళ్లు పోసి కలపాలి. ఈ ముద్దని గుండ్రని ఉండల్లా చేసి ఉడికించి ఉంచిన పిండిముద్దలో ముంచి తీయాలి. తరవాత బ్రెడ్‌పొడిలో దొర్లించి తీసి, కాగిన నూనెలో వేయించాలి.

## మిర్చి బజ్జీ



### కావలసినవి

పచ్చిమిర్చి(పెద్దవి): పది, సెనగపిండి: ఒకటిన్నర కప్పులు, పసుపు: చిటికెడు, ఉప్పు: తగినంత, నూనె: వేయించడానికి సరిపడా, **నింపేందుకు:** బంగాళాదుంపలు: మూడు, కారం: టీస్పూను, కొత్తిమీర తురుము: టేబుల్‌స్పూను, ఉప్పు: తగినంత

### తయారుచేసే విధానం

★ బంగాళాదుంపలు ఉడికించి పొట్టు తీసి, ఉప్పు వేసి మెత్తగా మెదపాలి. అందులోనే కారం, కొత్తిమీర వేసి కలపాలి.

★ సెనగపిండిలో పసుపు, ఉప్పు వేసి జారుగా కలుపుకోవాలి.

★ పచ్చిమిర్చిని చీల్చి గింజలు తీసేసి లోపల బంగాళాదుంపల మిశ్రమాన్ని నింపాలి. ఇప్పుడు వీటిని ఒక్కొక్కటిగా పిండి మిశ్రమంలో ముంచి కాగిన నూనెలో వేయించి తీసి, ముక్కలుగా కోసి తీపి లేదా కారం చట్నీతో వడ్డిస్తే సరి.

## వెజిటబుల్ కట్‌లెట్



### కావలసినవి

బంగాళాదుంపలు: అరకిలో, బీన్స్, క్యారెట్, క్యాప్సికమ్, బఠాణీ(అన్నీ కలిపి): పావుకిలో, కార్న్‌ఫ్లోర్: అరకప్పు, బ్రెడ్‌పొడి: కప్పు, అల్లంవెల్లుల్లి ముద్ద: 2 టీస్పూన్లు, చాట్ మసాలా: 2 టీస్పూన్లు, నిమ్మరసం: 2 టీస్పూన్లు, కొత్తిమీర తురుము: పావుకప్పు, ఉప్పు: రుచికి సరిపడా, నూనె: వేయించడానికి సరిపడా

### తయారుచేసే విధానం

★ బంగాళాదుంప ఉడికించి మెదపాలి. కూరగాయలన్నీ సన్నగా తరిగి కొద్దిగా ఉడికించి తీసి, నీళ్లన్నీ వంపేసి, తడి లేకుండా ఓ కాగితం మీద వేసి ఉంచాలి. తరవాత వీటిని బంగాళాదుంప ముద్దలో కలపాలి. అందులోనే ఉప్పు, అల్లంవెల్లుల్లి, కార్న్‌ఫ్లోర్, కొత్తిమీర తురుము, నిమ్మరసం, చాట్‌మసాలా అన్నీ కలిపి, మిశ్రమాన్ని గుండ్రని ఉండల్లా చేసి వడల్లా వత్తి బాణలిలో కొద్దిగా నూనె వేసి వేయించి తీయాలి.

★ తరవాత బ్రెడ్‌పొడిలో దొర్లించి, పెనంమీద కొద్దిగా నూనె వేసి రెండువైపులా కాల్చి తీసి, చట్నీ లేదా సాస్‌తో అందిస్తే రుచి అదుర్స్.

## ఖస్తా కచోరి



### కావలసినవి

మైదాపిండి: 2 కప్పులు, వంటసోడా: అరటీస్పూను, ఉప్పు: తగినంత, నూనె: వేయించడానికి సరిపడా, నింపేందుకు: మినప్పప్పు: అరకప్పు, అల్లంతురుము: టీస్పూను, పచ్చిమిర్చి: రెండు, జీడిపప్పు: 2 టేబుల్‌స్పూన్లు, ఎండుద్రాక్ష: టేబుల్‌స్పూను, నెయ్యి: 3 టేబుల్‌స్పూన్లు, ఇంగువ: చిటికెడు, దనియాలపొడి: టీస్పూను, జీలకర్రపొడి: అరటీస్పూను, కారం: టీస్పూను, సోంపుపొడి: పావుటీస్పూను, పంచదార: అరటీస్పూను, ఉప్పు: రుచికి సరిపడా, నిమ్మరసం: టేబుల్‌స్పూను, నూనె: వేయించడానికి సరిపడా

### తయారుచేసే విధానం

★ మైదాలో ఉప్పు, సోడా వేసి కలపాలి. తరవాత కొద్దిగా నూనె వేసి కలిపాక, తగినన్ని నీళ్లు పోసి పూరీ పిండిలా కలిపి, తడిబట్ట కప్పి, పక్కన ఉంచాలి. మినప్పప్పుని సుమారు రెండుగంటలపాటు నానబెట్టి, కొద్దిగా నీళ్లు పోసి కచ్చాపచ్చాగా రుబ్బాలి. పచ్చిమిర్చి, జీడిపప్పు సన్నగా తరగాలి.

★ ఓ బాణలిలో నెయ్యి వేసి అందులో రుబ్బిన పప్పు, అల్లంతురుము, పచ్చిమిర్చి ముక్కలు, ఇంగువ, దనియాలపొడి, జీలకర్రపొడి, కారం, సోంపు, జీడిపప్పు ముక్కలు, ఎండుద్రాక్ష వేసి కొద్దిగా వేయించాలి. తరవాత పంచదార, ఉప్పు, నిమ్మరసం వేసి కలిపి దించాలి. పిండి మిశ్రమాన్ని చిన్నపాటి ఉండల్లా చేసి, వీటిని మధ్యలో మందంగానూ అంచుల దగ్గర పలుచగానూ ఉండే చిన్నపాటి పూరీల్లా చేయాలి. వాటిల్లో వేయించిన పప్పు మిశ్రమాన్ని పెట్టి మళ్లీ గుండ్రని ఉండల్లా చేసి, వడల్లా వత్తి, నూనెలో వేయించి తీసి తీపి చట్నీతో అందించాలి.

# గూగుల్ అసలు పేరు ఏంటంటే...

**గూగుల్, యాహూ, బ్లాక్‌బెర్రీ, పెప్సీకో... ఇలా వివిధ రంగాల్లో మనకు సుపరిచితమైన సంస్థలు చాలానే ఉన్నాయి. కానీ వాటిని మొదలుపెట్టినప్పుడు మాత్రం ఆ సంస్థల పేర్లు వేరు. మరి ఆ సంస్థల అసలు పేర్లేంటి, ఇప్పుడున్న పేరు ఎలా వచ్చిందిలాంటి విషయాలపై ఓ లుక్కేద్దాం!**

### గూగుల్–బ్యాక్‌రబ్

గూగుల్... సెర్చ్ ఇంజిన్ ప్రపంచంలో రారాజుగా వెలుగొందుతున్న ఈ సంస్థ పేరు తెలియని వారుండరు. కానీ గూగుల్ మొట్టమొదటి పేరు మాత్రం ఇది కాదట. దీని వ్యవస్థాపకులు లారీ పేజ్, సర్గీబ్రిన్‌లు సెర్చ్‌ఇంజిన్ ప్రోగ్రామింగ్ మీద స్టాన్‌ఫోర్డ్ యూనివర్సిటీలో కలిసి పనిచేస్తున్నప్పుడు దాని పనితీరును బట్టి తమ సంస్థకు బ్యాక్‌రబ్ అని పేరు పెట్టారట. అంటే ఒక వెబ్‌సైట్ ఎంత ప్రధానమైనదీ, ఇలాంటి వేరే వెబ్‌సైట్ల లింకులు ఏమిటీ లాంటి బ్యాక్ గ్రౌండ్ వర్క్ చేసేదట వీళ్ల ప్రోగ్రామింగ్. కాబట్టి స్టాన్‌ఫోర్డ్‌లో 'బ్యాక్‌రబ్' పేరుతో ఓ సెర్చ్ ఇంజిన్‌ను నడిపారట కూడా. ఏడాది తర్వాత తమ సంస్థ చేసే పనులు విస్తరిస్తుండటంతో ఆ పేరు దీనికి సరిపడలేదని భావించి అక్కడి విద్యార్థులతో మేధోమథన కార్యక్రమం నిర్వహించి, ఒకటి తర్వాత 100 సున్నాలు అని అర్థమొచ్చే గణిత పదం గూగోల్ నుంచి గూగుల్.కామ్ అని వెబ్‌సైట్‌కు పేరు పెట్టారు.

### పెప్సి – బ్రాడ్స్ డ్రింక్

శీతల పానీయాల సంస్థల్లో బాగా పేరు పొందిన, దాదాపు మనందరం రుచి చూసిన పెప్సి డ్రింక్ తయారీ సంస్థ మొదటి పేరు బ్రాడ్స్ డ్రింక్. ఒక డ్రగ్ కంపెనీలో దీన్ని తయారు చేసిన వ్యక్తి కాలెబ్ బ్రాడ్‌హామ్ తన పేరు మీదుగా ఈ పానీయాన్ని అమ్మడం మొదలు పెట్టాడట. తొలుత తన దుకాణానికి వచ్చే వినియోగదారులను ఆకర్షించేందుకు ఎండాకాలంలో దీన్ని తయారు చేసినా, తర్వాత తర్వాత ఆ పానీయం కోసమే జనం రావడం మొదలు పెట్టారట. ఐదేళ్లు గడిచే సరికి ఈ పానీయంలో తను అనుకున్న రిఫ్రెష్‌మెంట్‌ని మించి ఇంకా ఏదో ఉందని నమ్మిన బ్రాడ్ దీని పేరు మార్చాలనుకున్నాడు. ఈ పానీయాన్ని కోలా గింజల సారం, వెనీలా, కొన్ని రకాల సుగంధ ద్రవ్యాలను కలిపి తయారు చేశారట. కడుపుబ్బరం తదితర లక్షణాలను డిస్‌పెప్సియా అని పిలుస్తారు. కోలా గింజల సారంతో చేసే ఈ ద్రావణం కడుపుబ్బరాన్ని తగ్గించడానికి కూడా సాయపడుతోంది కాబట్టి దీనికి పెప్సి అనే పేరును పెట్టారట.





### నైక్ – బ్లూరిబ్బన్

ప్రముఖ బహుళజాతి సంస్థ నైక్ మొట్టమొదటి పేరు బ్లూరిబ్బన్ స్పోర్ట్స్. 1964లో మొదలైన ఈ సంస్థ తొలుత జపాన్ షూ కంపెనీ ఒనిట్సుకా టైగర్‌కు డిస్ట్రిబ్యూటర్‌గా పని చేసేది. కాలం గడిచే కొద్దీ సంస్థల మధ్య సఖ్యత తగ్గడంతో బ్లూరిబ్బన్ అక్కడి నుంచి వైదొలగి గ్రీకు దేవత పేరు మీదుగా విజయం అనే అర్థం వచ్చేలా నైక్ అనే సొంత పేరుతో ఉత్పత్తిని మొదలు పెట్టింది.

### సోనీ – టోక్యో సుషిన్ కోగ్యో

సోనీ సంస్థ మొట్టమొదట టోక్యో దగ్గరి ఓ ఊళ్లో 1946లో రేడియోలు బాగు చేసే షాపుగా మొదలైంది. దాని పేరు టోక్యో సుషిన్ కోగ్యో. మసారు ఇబుకా, అకియో మోరిటాలు స్థాపించిన ఈ సంస్థ తర్వాత జపాన్‌లోనే మొట్టమొదటి ట్రాన్సిస్టర్ రేడియో, ట్రాన్సిస్టర్ టీవీలను తయారు చేసింది. 1958లో తమ సంస్థకు లాటిన్‌లోని సోనస్ అనే పదం నుంచి శబ్దం అనే అర్థం వచ్చేలా సోనీ అనే పేరును పెట్టుకున్నారు.

### పానాసోనిక్–మాత్‌సుషీత ఎలక్ట్రానిక్స్

ఎలక్ట్రానిక్స్ సంస్థ పానాసోనిక్ పేరు 2008 వరకూ మాత్‌సుషీత ఎలక్ట్రిక్ ఇండస్ట్రియల్ కార్పొరేషన్‌గానే ఉంది. ఆ సమయంలో కూడా కొన్ని రకాల ఉత్పత్తుల్ని పానాసోనిక్ అనే పేరుతోనే విక్రయించేదీ సంస్థ. అయితే 2008 సంవత్సరంలో ప్రపంచ వ్యాప్తంగా తమ సంస్థకు సంబంధించిన ఉత్పత్తులన్నింటికీ ఒకే పేరు ఉండాలన్న ఉద్దేశంతో పానాసోనిక్‌ను తమ సంస్థ పేరుగా మారుస్తున్నట్టు ప్రకటించారు.

### బ్లాక్‌బెర్రీ – రీసెర్చ్ ఇన్ మోషన్

చాలా మందికి ఫేవరెట్ ఫోన్ అయిన బ్లాక్‌బెర్రీ సంస్థ మొదటి పేరు రీసెర్చ్ ఇన్ మోషన్. తమ సంస్థ తయారు చేసే ఫోన్ల మీటలు బ్లాక్‌బెర్రీ పండులోని ఉబ్బెత్తు భాగాల్ని తలపిస్తాయన్న ఆలోచనతో కంపెనీ పేరునే బ్లాక్‌బెర్రీగా మార్చుకున్నారు. 2013 సంవత్సరం దాకా ఈ సంస్థ పేరు రీసెర్చ్ ఇన్ మోషన్‌గానే ఉంది. అయితే మార్కెట్లో ఉన్న విపరీతమైన పోటీని తట్టుకునేందుకు ఉత్పత్తితో పాటూ జనాన్ని ఆకర్షించేందుకు ఇలా పేరును మార్చుకుందీ సంస్థ.

ఇవేకాదు, తమ సంస్థ పేర్లను వివిధ కారణాల వల్ల మార్చుకున్న పేరున్న సంస్థలు ఇంకా చాలానే ఉన్నాయి. ప్రఖ్యాత సెర్చ్ ఇంజిన్ యాహూ మొదటి పేరు జెర్రీ అండ్ డేవిడ్స్ గైడ్ టు ద వరల్డ్ వైడ్ వెబ్, బెస్ట్ బై పాత పేరు సౌండ్ ఆఫ్ మ్యూజిక్, ఈబేకు ఇంతకు ముందు పేరు ఆక్షన్‌వెబ్, స్నికర్స్ వెనకటి పేరు మారథాన్, మాస్టర్ కార్డ్ తొలి పేరు మాస్టర్ ఛార్జ్, ఐబీఎమ్ పాత పేరు కంప్యూటింగ్ టేబ్యులేటింగ్ రికార్డింగ్ కార్పొరేషన్, ప్లేబాయ్‌కి మొదట్లో స్టాగ్‌పార్టీ అనే పేరూ ఉండేవి. 



# రాశి ఫలం

గ్రహబలం (ఆగస్టు 13 - 19)



డా॥ శంకరమంచి రామకృష్ణ శాస్త్రి



## మేషం అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం

ముఖ్య విషయాల్లో శ్రద్ధ చూపండి. ఆర్థిక స్థితిగతులు తారుమారు అయ్యే అవకాశముంది. ప్రశాంతమైన మనసుతో పనిచేస్తే తప్పక విజయం లభిస్తుంది. శత్రువులపై మీదే పైచేయి. ముఖ్య వ్యక్తులతో సంతోషంగా గడుపుతారు. ఒక వార్త విశ్వాసాన్ని పెంచుతుంది. ప్రయాణాల్లో జాగ్రత్తలు పాటించాలి. ఆరోగ్యంపై శ్రద్ధ పెంచాలి. సూర్యస్తుతి మేలు చేస్తుంది.



## వృషభం కృత్తిక 2,3,4 పాదాలు; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

ఆత్మవిశ్వాసం ముందుకు నడుపుతుంది. సకాలంలో పనులు పూర్తిచేస్తారు. పేరు ప్రతిష్ఠలు సంపాదిస్తారు. గతంకంటే ఉత్తమకాలం. ఐశ్వర్యప్రాప్తి ఉంది. ఆశించిన ప్రతిఫలం లభిస్తుంది. కుటుంబసభ్యులకు మేలు జరుగుతుంది. శుభ కార్యక్రమాలు చేపడతారు. అపోహలు తొలగుతాయి. ఆరోగ్యం చేకూరుతుంది. సాయి దర్శనం ఉత్తమం.



## మిథునం మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు

శుభకాలం నడుస్తోంది. ప్రయత్నాలు సఫలీకృతమవుతాయి. ధర్మకార్యాచరణ ఉంది. గృహ, వాహన యోగాలున్నాయి. దైవబలం వల్ల ఆపదలు దూరమవుతాయి. మిత్రుల వల్ల మేలు జరుగుతుంది. ఉపకారం చేసేవారు పెరుగుతారు. విఘ్నాలు ఎదురైనా మనోబలంతో అధిగమిస్తారు. ఉద్యోగ, వ్యాపారాల్లో మంచి ఫలితాలున్నాయి. ఆంజనేయ దర్శనం శుభాన్నిస్తుంది.



## కర్కాటకం పునర్వసు 4వ పాదం; పుష్యమి, ఆశ్లేష

ప్రతిఫలాపేక్ష లేకుండా పనిచేస్తే విజయప్రాప్తి ఉంటుంది. అడుగడుగునా విఘ్నాలున్నాయి. మిత్రుల సలహాతో నిర్ణయాలు తీసుకోండి. ఆలోచన లేకుండా పని చేస్తే డబ్బు నష్టపోవలసి రావచ్చు. మోసపూరిత వాతావరణం ఉంది. చంచల స్వభావాన్ని వీడండి. ఒక వార్త మీలో విశ్వాసాన్ని నింపుతుంది. శుభకాలం దగ్గరలోనే ఉంది. శివాష్టోత్తరం చదవండి.



## సింహం మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

సౌభాగ్యసిద్ధి ఉంది. ఉత్సాహంగా ఆలోచించండి. ప్రతిభకు తగ్గ ప్రశంసలు అందుతాయి. శ్రమ అధికమైనా ఫలితం ఉత్తమంగా ఉంటుంది. గౌరవం పెరుగుతుంది. న్యాయబద్ధంగా వ్యవహరించడం వల్ల మనశ్శాంతి లభిస్తుంది. మనోబలంతో తీసుకునే నిర్ణయాలు బంగారు భవిష్యత్తునిస్తాయి. ఆర్థికస్థితి క్రమంగా బలపడుతుంది. లక్ష్మీధ్యానం శుభదాయకం.



## కన్య ఉత్తర 2, 3, 4 పాదాలు; హస్త, చిత్త 1, 2 పాదాలు

అవసరాలకు ధనం అందుతుంది. సమస్యలు తొలగుతాయి. నూతనాంశాలను తెలుసుకుంటారు. కష్టానికి తగ్గ ప్రతిఫలం వెంటనే దక్కుతుంది. విందు వినోద కార్యక్రమాలతో సంతోషంగా కాలం గడుస్తుంది. ధనలాభం ఉంది. ఖర్చులు పెరగకుండా జాగ్రత్తలు తీసుకోండి. సకాలంలో విశ్రాంతి తీసుకోండి. ఇష్టదైవాన్ని ఆరాధించండి.



## తుల చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు

అధికారుల వల్ల మేలు జరుగుతుంది. సంకల్పసిద్ధి ఉంది. తలపెట్టిన కార్యాలు త్వరగా పూర్తిచేస్తారు. సుఖసౌఖ్యాలను అనుభవిస్తారు. ధనయోగం ఉంది. ప్రయత్నానికి తగ్గ ఆర్థిక సిద్ధి ఉంటుంది. ఆవేశపూరిత వాతావరణం కల్పించేవారున్నారు. శాంతంగా బదులివ్వండి. ప్రశంసలు పొందుతారు. గతంలో కాని ఒక పని పూర్తి అవుతుంది. వేంకటేశ్వరస్వామిని దర్శించండి.



## వృశ్చికం విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

ఆర్థికపరమైన అభివృద్ధిని సాధిస్తారు. ఫలితాలు అనుకూలంగా వస్తాయి. అదృష్టం వరిస్తుంది. సాహసంతో నిర్ణయం తీసుకోండి, ఫలితం బ్రహ్మాండంగా ఉంటుంది. బాగా కష్టపడాలి. ధైర్యం అవసరం. బుద్ధిబలంతో వెంటనే విజయం చేకూరుతుంది. ఎవరితోనూ వివాదాలు రాకుండా చూసుకోండి. మనశ్శాంతి తగ్గే సూచనలున్నాయి. నారాయణ మంత్రం పఠించండి.



## ధనుస్సు మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

చిత్తశుద్ధే విజయాన్నిస్తుంది. పనుల్లో మొహమాటాలకు పోవద్దు. ఎప్పటి పని అప్పుడే చేయండి. కుటుంబసభ్యుల సూచనలు అవసరమవుతాయి. రుణ సమస్యలు ఎదురయ్యే సూచనలున్నాయి. కాలాన్ని సద్వినియోగం చేసుకోండి. ప్రశాంతంగా పనులు చేయండి. చిరునవ్వుతో ముందుకు సాగండి. మిత్రుల సహకారంతో శుభం చేకూరుతుంది. గణపతి ధ్యానం కార్యసిద్ధినిస్తుంది.



## మకరం ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు; శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు

కార్యసిద్ధి ఉంది. ఏకాగ్రత లోపం వల్ల పనులు నిదానంగా పూర్తి అవుతాయి. ఆధ్యాత్మిక మార్గంలో ఎక్కువగా గడపండి. మనసు చెప్పింది చేయండి. ముఖ్య విషయాల్లో కుటుంబసభ్యులతో కలిసి నిర్ణయాలు తీసుకుంటే మంచిది. బంధువులతో విభేదాలు వచ్చే అవకాశం ఉంది. ఆర్థిక విషయాల్లో శ్రద్ధ అవసరం. వారాంతంలో శుభఫలితం ఉంటుంది. సుబ్రహ్మణ్య ధ్యానం రక్షిస్తుంది.



## కుంభం ధనిష్ఠ 3, 4 పాదాలు; శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు

శుభయోగాలున్నాయి. ఏ పని ప్రారంభించినా శీఘ్ర ఫలితం లభిస్తుంది. కాలం కలిసివస్తుంది. అభిమానించేవారు పెరుగుతారు. ఉద్యోగ వ్యవహారాల్లో ప్రత్యేకమైన గుర్తింపు లభిస్తుంది. దైవానుగ్రహంతో ఒక మేలు జరుగుతుంది. ఆపదలు తొలగిపోతాయి. ఆర్థికంగా అభివృద్ధి ఉంటుంది. చంచల స్వభావాన్ని రానీయవద్దు. లక్ష్మీధ్యానం అదృష్టాన్నిస్తుంది.



## మీనం పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

సంతృప్తికరమైన ఫలితాలున్నాయి. భూగృహయోగాలు సిద్ధిస్తాయి. ప్రయత్నపూర్వక విజయం ఉంది. పట్టుదలతో చేసే పనులు వెంటనే ఫలిస్తాయి. ఇష్టుల సలహాలు అభివృద్ధినిస్తాయి. సుఖసంతోషాలున్నాయి. అనవసరమైన విషయాల్లో తలదూర్చవద్దు. ముఖ్య వ్యక్తులతో కలిసి ఆనందాన్ని పంచుకుంటారు. నూతన అధికారయోగం ఉంది. సంకల్పం సిద్ధిస్తుంది. గాయత్రీ జపం శుభప్రదం.

